**కొలుపు**
(సాహిత్య వ్యాసాలు)
కాసుల ప్రతాపరెడ్డి

**హక్కులు** : రచయితవి

ప్రథమ ముద్రణ : డిసెంబర్ 2002

వెల : రూ. 30/-

**కవర్ డిజైన్** : కాస్మిక్ గ్రాఫిక్స్, ఫోన్: 24056803

**ప్రతులకు** : కె. సరస్వతి, 303, నార్త్‌బ్లాక్, డ్రీమ్ హోమ్
శాలివాహన టవర్స్, శాలివాహననగర్,
మూసారాంబాగ్, హైదరాబాద్- 36

**సహచర బుక్‌హౌస్,** కాచిగుడా, హైదరాబాద్.

**నవోదయ బుక్‌హౌస్,** కాచిగుడాచౌరస్తా, హైదరాబాద్.

దిశ పుస్తక కేంద్రం, చిక్కడపల్లి, హైదరాబాద్-20.

ముద్రణ : వార్తతేజ ఆఫ్‌సెట్ ప్రింటర్స్, 16-11-20/7/ హెచ్,
సూపర్‌బజార్, సలీంనగర్, మలక్‌పేట్, హైదరాబాద్.
ఫోన్: 55827403

ప్రజాస్వామిక విలువల కోసం,
హక్కుల కోసం పోరాడి అలసిన యోధుడు
**కాళోజీ** యాదికి.....

# మాట్లాడడం అనివార్యమైన వేళ

సాహిత్య వ్యాసాల పుస్తకం ఒకటి తేవాలని నేను ఎప్పుడూ అనుకోలేదు. అలా తేవాల్సిన అవసరాన్ని కాలం, పరిస్థితులు కల్పించాయి.సాహిత్యం నా కార్యరంగం ఎప్పుడూ కాదు. వార్తా సేకరణలో భాగంగా నా స్వభావ రీత్యా గత 15 ఏళ్లుగా తెలుగు సమాజంలోని ఉద్యమాలను దగ్గరి నుంచి చూసే అవకాశం, వాటిని విశ్లేషించే అవసరం ఏర్పడింది. మెజారిటీ ప్రజలకు, అందునా బలహీనుల పక్షాన జరిగిన ఉద్యమాలను చూసినప్పుడు స్పందించకుండా ఉండలేకపోయాను. అందులో భాగంగానే నేను సాహిత్య వ్యాసాలు రాశాను. ప్రత్యేకంగా ఇవి సాహిత్యంలో చేయి పెట్టాలనే దుగ్ధతో రాసినవి కావు.

నా సాహిత్య వ్యాసాలు, పుస్తక సమీక్షలు ఇంకా కొన్ని ఇందులో చేరాల్సినవి ఉన్నాయి. అప్పుడే నేను ఎటు వైపు ఉన్నాననే విషయం ఇంకా స్పష్టంగా వెల్లడయ్యేది. అలా చేరాల్సిన వాటిలో బి.యస్. రాములు 'పాలు' కథా సంకలనంపై, బోయ జంగయ్య 'జాతర' నవలపై, అరణ్యకృష్ణ కవితా సంకలనంపై, సుంకిరెడ్డి నారాయణ రెడ్డి 'తోవ ఎక్కడ?' కవితా సంకలనంపై, నీలగిరి సాహితి 'బహువచనం' కవితా సంకలనంపై సమీక్షలు...... పత్రికల్లో మాట్లాడకుండా ఉండలేని పరిస్థితి వచ్చినప్పుడు రాసిన వ్యాసాలతో, సమీక్షలతో ఒక పుస్తకం తేవాల్సి వస్తుందని కాబట్టి వాటిని భద్రపరచలేదు. అలా భద్రపరచడం నా వల్ల కానిపని. అందువల్లనే ఇందులో చేర్చాల్సిన వ్యాసాలు చాలా చేరలేదు.

కొన్ని సాంకేతిక కారణాల వల్ల మా అబ్బాయిలు రవికిరణ్, నిశాంత్ పేర్ల మీద వ్యాసాలు రాశాను. దాని వల్ల నా పేరుపై పడాల్సిన బురద వాళ్ల పేర్ల మీద పడింది. అందుకు వారికి క్షమాపణలు. రక్తసంబంధం కన్నా సాహిత్యసంబంధం గొప్పదని నిరూపిస్తూ వస్తున్న తమ్ముడు, కవి డాక్టర్ కాసుల లింగారెడ్డిని తలుచుకోకుండా ఉండలేను. సాహిత్య రంగంలో పచ్చిపుండయిన నా మనస్సుకు మందురాస్తూ నన్ను బతికిస్తున్న సరస్వతికి కృతజ్ఞతలు చెప్పడం సరిపోదు.

నా బాధను తన బాధగా స్వీకరించి ఈ పుస్తకానికి ముందుమాటగా ఒక వ్యాసాన్ని రాసిచ్చిన బి.యస్.రాములుగారికి, కవర్‌పేజీ డిజైన్ చేసిన కవి అయిల సైదాచారికి, ఇంకా చాలా మందికి నేను రుణపడి ఉంటాను. చివరగా-ఈ పుస్తకం కేవలం పాఠకుల కోసమే, సాహిత్యకారులకు కాదని మనవి.

12-12-2002
హైదరాబాద్

కాసుల ప్రతాపరెడ్డి

# దక్షిణ భారత సాహిత్యం-తెలంగాణ ముద్ర

భారతదేశంలోని తెలంగాణ చరిత్రకు ఒక ప్రత్యేక స్థానం ఉంది. జాతీయోద్యమకాలంలో తెలంగాణ ఫ్యూడల్ వ్యతిరేక పోరాటాలను, రష్యా, చైనా, క్యూబా, తదితర దేశాల తర్వాత అంతటి రైతాంగ సాయుధ పోరాటాలను నడిపి ప్రపంచ చరిత్రలో తనదైన విశిష్ట స్థానాన్ని సాధించుకున్నది. జాతీయోద్యమంలో అతివాద, మితవాద, మధ్యేవాద, వామపక్ష భావజాలాలు, అంబేద్కరిజం, గాంధీజం ప్రధాన పాత్ర వహిస్తే తెలంగాణ ఆచరణ ద్వారా సాయుధ పోరాటాలతో ప్రపంచాన్ని ప్రభావితం చేసింది.

దక్షిణ భారతదేశం పూర్వ కాలం నుంచి కథలకు కాణాచి. సాహిత్యానికి పుట్టినిల్లు. ఆర్య సంస్కృతికి ధీటుగా ద్రావిడ సంస్కృతి, దక్షిణ భారతదేశ సాహిత్యం, సంస్కృతి ప్రత్యేక అస్తిత్వంతో పుట్టి పెరిగి కొనసాగాయి. విభిన్న చారిత్రక దశల్లో దక్షిణ భారతదేశం అఖండ భారతానికి సైద్ధాంతిక, సామాజిక నాయకత్వాన్ని అందించింది. ప్రపంచంలోని క్లాసిక్స్‌గా పేరొందిన కథా సంకలనాల్లో హెచ్చు భాగం దక్షిణ భారతదేశ ప్రజల నుంచి సేకరించి పైశాచీలో, సంస్కృతంలో, ప్రాకృత, పాళీ భాషల్లో రాయబడినవే. అవి స్థలకాలాల పేర్లు రూపాంతరం చెంది విశ్వవ్యాప్తం అయ్యాయి. జాతీయోద్యమ కాలంలోనూ ఇక్కడి ఉద్యమాలు, చరిత్ర, సాహిత్యం మొత్తం భారతీయ రచయితలను, కళాకారులను ప్రభావితం చేశాయి. పేరియార్ రామస్వామి నాయకర్, నారాయణగురు, త్రిపురనేని రామస్వామి చౌదరి, భాగ్యరెడ్డివర్మ (మేదరి భాగయ్య) కాస్తా పైకి వెళ్తే మహాత్మా జ్యోతిబా పూలె, బి.ఆర్. అంబేద్కర్ జాతీయోద్యమ కాలంలో హిందూ మత వాద జాతీయవాదానికి భిన్నంగా నాస్తిక, హేతువాద, బౌద్ధవాద, జాతీయోద్యమ వాదాలను ముందుకు తెచ్చి చారిత్రక దశలను సంస్కృతిని సమూలంగా మార్చే కృషి చేశారు.

స్వాతంత్ర్యానంతరం కూడా శ్రీకాకుళం, దండకారణ్యం, గోదావరి లోయ, కేరళ, తమిళనాడు పోరాటాలతో పాటు కారంచేడు నుంచి దళితవాద, స్త్రీవాద పోరాటాలకు పుట్టినిల్లయి సైద్ధాంతిక భావజాలాన్ని ఇక్కడి నుంచి ప్రపంచానికి అందించడం జరుగుతూ వస్తున్నది. ఎమర్జెన్సీ తర్వాత దక్షిణ భారతదేశం నుంచి మరింత బలంగా సామాజికోద్యమాలు, తాత్విక భావజాల పోరాటాలు ఉధృతమయ్యాయి. ఇటీవల విప్లవవాదం, దళితవాదం, స్త్రీవాదం, చిన్న రాష్ట్రాల ఉద్యమం మరింత పదునెక్కాయి. చుండూరు సంఘటనను నిరసిస్తూ 106 మంది

పార్లమెంటు సభ్యులు రాష్ట్రపతిని కలవడానికి వెళ్లినప్పుడు శంకర్ దయాళ్ శర్మ కలువ నిరాకరించినందువల్ల దళితుడే రాష్ట్రపతి కావాలనే నినాదం ముందుకు తెచ్చి కె.ఆర్. నారాయణన్‌గారిని రాష్ట్రపతిగా దేశం చూసుకునే అదృష్టాన్ని దక్షిణ భారతదేశం కలిగించింది. స్వాతంత్ర్యానంతరం తొలిసారిగా సరైన మెజారిటీ లేకపోయినా అయిదేళ్ల పాటు ప్రభుత్వాన్ని అందించిన ప్రధాన మంత్రిని కూడా దక్షిణ భారతదేశం అందించింది.

అంబేద్కరిజం వెలుగులో రాష్ట్రంలో ఎండ్లూరి చెన్నయ్య, బొజ్జా తారకం, కత్తి పద్మారావు, బి.యస్. రాములు, వి.జి.ఆర్. నారగోని, మాష్టార్జీ, కంచె ఐలయ్య,.... వంటి ఎందరో భారతీయ చారిత్రక భౌతికవాదాన్ని అగ్రకులీకరణ నుంచి కాపాడి పుటం పెట్టి అశేష ప్రజల బహుజన కులాల దృక్పథంతో సరిచూసి, సరిచేసి ఒక నూతన ప్రాపంచిక దృక్పథాన్ని అందించారు. ఇవాళ్ల ప్రపంచవ్యాప్తంగా వీటి మీద చర్చ జరుగుతున్నది.

దక్షిణ భారతదేశంలో తెలంగాణ తన ప్రత్యేకతను విశిష్టతను నిలుపుకున్నది. 1980ల నుంచి మాష్టార్జీ, బి.యస్. రాములు, కంచె ఐలయ్య, కాలువ మల్లయ్య, వి.జి.ఆర్. నారగోని, .... మొదలైనవారు తెలంగాణ నుంచి పెరిగి అంబేద్కరిజాన్ని, దళితవాదాన్ని తమదైన నిర్దిష్ట స్థలకాల పరిస్థితుల నుంచి విశ్లేషించి సార్వజనీన సూత్రీకరణలను, సిద్ధాంతాలను ప్రపంచానికి అందించారు. తద్వారా తెలుగు సాహిత్యంలో దళితవాద సాహిత్యం వేగం పుంజుకున్నది. బహుజన సమాజ్ పార్టీ పుట్టుక, వి.పి. సింగ్ ప్రవేశపెట్టిన బి.సి. మండల్ కమీషన్ రిజర్వేషన్ అనుకూల, వ్యతిరేకోద్యమాలు, నక్సలైట్ ఉద్యమాలు, కారంచేడు, చుండూరు, నీరుకొండ, పొలాస, కరీంనగర్, నిజామాబాద్, నల్లగొండ దళిత ఉద్యమాలు ఇందుకు పునాది వేశాయి. వందలాది రచయితలు ఎదిగారు, వేలాది రచనలు వెలువడ్డాయి.

భాషా ప్రయుక్త రాష్ట్రాలకు దేశానికి ఆదర్శంగా నిలిచి ప్రేరణగా నిలిచిన త్యాగం తెలంగాణ ప్రజలది. తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటం ద్వారా ఎదిగిన నాయకత్వంలో కోస్తా వారి ఆధిపత్యం, వారి సైద్ధాంతిక వలసవాద తత్వం అంతర్లీనంగా ఉండడం వల్ల భోళాగా సరేనని బోల్తా పడిన చరిత్ర తెలంగాణ విప్లవ ప్రజానీకానిది. బూర్గుల రామకృష్ణా రావు నైజాం రాష్ట్ర ముఖ్యమంత్రిగా ఉండి భాషా ప్రయుక్త రాష్ట్రాలకు అంగీకరిస్తూ తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఏర్పాటును కోరకుండా విశాలాంధ్రకు అనుకూలంగా తన పదవిని త్యాగం చేసి శిబి చక్రవర్తి, వామనుడి పాదం కింద నలిగిపోయిన బలి చక్రవర్తి అయ్యారు. అతని దాతృత్వం చరిత్రకు ఎక్కలేదు. అక్కడి నుంచి తెలంగాణ చరిత్ర, సాహిత్యం విశాలాంధ్రలో వలసవాదులకు అనువుగా అణచబడడం మొదలైంది. వామనుడి మూడో పాదం కింద, వామపక్షాల మూడో పాదం కింద కోస్తా ప్రాంత వలసాధిపత్య కాంగ్రెస్ వాదుల కింద తెలంగాణ చరిత్ర సంస్కృతి మసిపూసి మారేడు కాయ చేయబడి వారిలో చేతిలో ఆటబంతి అయింది. ఎవరికి ఇష్టం వచ్చినట్లుగా వారు తెలంగాణ చరిత్రను వ్యాఖ్యానించారు. వ్యాఖ్యానాన్నే చరిత్రగా మన ముందుంచారు.

లోకంలో ఇంకెవరూ అలాంటివారు లేనట్లు మిగతా రాజులందరు చరిత్రలో మంచివారయినట్టు నిజాం రాజు ప్యూడల్ అని కొందరు పనిగట్టుకొని ప్రచారం చేసి తెలంగాణలోని దొరలు, భూస్వాములు, పట్వారీలు చేసిన దౌర్జన్యాలన్నింటికి నిజామే కారణమన్నట్లుగా కోపాన్ని నిజాంపైకి మళ్లించి అసలు నేరస్థులు కాంగ్రెస్ టోపీలు ధరించి ప్రజానాయకుల రూపాల్లో ముందుకు వచ్చారు. ఇలా కమ్యూనిస్టులకు కావాల్సింది, కాంగ్రెస్ వాళ్లకు కావాల్సింది ఒక్కటే అవడం వల్ల భారతదేశ చరిత్రలో ఏ రాజు మీదా పడనంతటి బురద నిజాం నవాబు మీద కుమ్మరించడం జరిగింది. నిజాం రాజ్యం ఎంతో వెనుకబడిపోయిందని సూత్రీకరణలు చేసి సానుభూతి పేరుతో తమ ఆధిక్యతను ప్రతిష్ఠించుకొనే క్రమాన్ని చేపట్టారు. తద్వారా వాస్తవాలు, చారిత్రక సత్యాలు మరుగున పడిపోయాయి. సురవరం ప్రతాపరెడ్డి, మాడపాటి హనుమంతరావు మొదలుకొని వట్టికోట ఆళ్వారు స్వామి, దాశరథి రంగాచార్య, స్వామి రామనందతీర్థ, ప్రొఫెసర్ కేశరావు జాదవ్, కాళోజీ, సామల సదాశివ, బిరుదురాజు రామరాజు, ప్రొఫెసర్ కె. జయశంకర్, తెలంగాణ ప్రభాకర్ (నాట్యకళ), గాదె ఇన్నయ్య, ప్రొఫెసర్ జనార్ధన్ రావు, ప్రొఫెసర్ సింహాద్రి, ప్రొఫెసర్ కె. శ్రీనివాసులు, ప్రొఫెసర్ పి.ఎల్. విశ్వేశ్వరరావు, అంబటి సురేంద్రరాజు, ప్రొఫెసర్ జయధీర్ తిరుమలరావు, ఎ.ఎస్. పోశెట్టి, కె. శ్రీనివాస్, డాక్టర్ సంగిశెట్టి శ్రీనివాస్, డాక్టర్ ముదిగంటి సుజాతారెడ్డి, డాక్టర్ కాలువ మల్లయ్య, మిట్టపల్లి పాణిగ్రాహి, పి. లోకేశ్వర్, శోభాగాంధి, కాసుల ప్రతాపరెడ్డి, గుడిపాటి మొదలైనవాళ్లు తమ పరిశోధనలతో మరుగున పడిన సామాజిక చరిత్రను, సాహిత్యాన్ని వెలికి తీసి అందించారు. తెలంగాణకు జరిగిన నష్టాన్ని 1950 నుంచే అంచనా వేస్తూ చెప్పిన విశ్లేషణలను కూడా మనకు అందించారు.

నిజాం నవాబు 1921లోనే వెట్టి చాకిరిని నిర్మూలిస్తూ జీవో (ఫర్మానా) జారీ చేశాడని ఎందరికి తెలుసు? నిజాం రాజ్యం అఖండ భారతంలోని 600 సంస్థానాల లోపల అతి పెద్ద రాజ్యమని ఎందరికి తెలుసు? ప్రపంచంలోనే అత్యంత సంపన్నమైన రాజ్యాల్లో నిజాం రాజ్యం ఒకటని ఎందరికి తెలుసు? డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్‌కు కాలేజీ పెట్టడానికి 10 లక్షల రూపాయల విరాళాన్ని నిజాం రాజు ఇచ్చాడని ఎంత మందికి తెలుసు? ఇవాళ, నిన్న నక్సల్బరీలో సంథాలులు, శ్రీకాకుళంలో గిరిజనులు, ఆదిలాబాద్, గడ్‌చిరోలిలో గోండులు తిరుగుబాట్లు చేస్తే

వారి సమస్యలేమిటో పరిశీలించి పరిష్కారం కోసం కమీషన్లు వేశారా? కానీ 1940లో కొమురం భీం తిరుగుబాటు చేసి చనిపోయినప్పుడు నిజాం రాజు ప్రపంచ ప్రఖ్యాత ఆంత్రోపాలజిస్టు హేమన్ డార్ఫ్‌ను పిలిపించి గోండు గిరిజనుల సమస్యలను అధ్యయనం చేసి పరిష్కారం కోసం సూచనలు చేయాలని కోరారు. ఇందులో ప్రజాస్వామ్య ప్రభుత్వాలు అణచివేత దారులా, నిజాం అణచివేతదారుడా? నిజాం రాజుకున్న పాటి ప్రజాస్వామిక తత్వం 1967లో నక్సల్బరీని అణచివేసిన జ్యోతిబసుకు గానీ, 1969లో శ్రీకాకుళోద్యమాన్ని అణచివేసిన వెంగళరావుకు గానీ, ఆ తర్వాతి ప్రభుత్వాల ముఖ్యమంత్రులకు గానీ ఉందా అని బేరీజు వేసుకోవాల్సిన అవసరం ఉంది.

నిజాం కాలంలోనే అంబేద్కర్ కన్నా పది సంవత్సరాల ముందే దళితుల సమస్యలను తీసుకొని మేదరి భాగయ్య ఆదిహిందువులనే సిద్ధాంతాన్ని వ్యాప్తిలోకి తెచ్చి గౌలిగుడలో ఆదిహిందూభవన్ నిర్మాణం చేసి పాఠశాలలను నడిపాడు. అవి ఇప్పటికీ కొనసాగుతున్నాయి. ఆయన మచిలీపట్నంలో అఖిల భారత షెడ్యూల్డ్ కాస్ట్ మహాసభకు అధ్యక్షత వహించాడు. ఈనాటి హైకోర్టు, సిటీ కాలేజీ, నాటి అసెంబ్లీ హాళ్లను ఆదెయ్య అనే దళిత ఇంజనీరు నిజాం కాలంలో నిర్మించాడని ఎంత మందికి తెలుసు? నిజాం కాలంనాటి వంతెనలు, ప్రాజెక్టులు, నిర్మాణాలు ఇప్పటికీ చెక్కుచెదరని ఉన్నత ప్రమాణాలతో ఉంటే ప్రజాప్రభుత్వాలు చేస్తున్న నిర్మాణాలు మన కళ్ల ముందే కుప్పకూలిపోతున్న విషయం అందరికీ తెలుసు.

తన ప్రజలు కూడా ప్రపంచ విజ్ఞానాన్ని అందుకోవాలని ఆసియా దేశంలోనే తలమానికంగా నిలిచే ఉస్మానియా యూనివర్శిటీని 1918లోనే నిర్మించిన ఘనత నిజాం నవాబుదేనని అంగీకరించడానికి ఎంతో గుండె బలం కావాలి. తన ప్రజలు ఆధునిక వ్యవసాయ పద్ధతులను నేర్చుకోవాలని కోస్తావారిని పిలిపించి కొంత భూమి కేటాయించి మిమ్మల్ని చూసి మా వాళ్లు నేర్చుకోవాలని కోరిన కోరిక అభివృద్ధిని ఆహ్వానించేది కాదా? పోచంపాడు ప్రాజెక్టు కన్నా ముందే 1942లోనే దానికన్నా ఎగువ ప్రాంతమైన కుషాయిగుడా వద్ద ప్రాజెక్టు నిర్మించడం ద్వారా సిద్ధిపేటతో సహా ఎగువ ప్రాంతాలను ఆయకట్టు కిందికి తీసుకురావాలని, ఇచ్చంపల్లి ప్రాజెక్టు నిర్మించాలని ప్రణాళికలు వేసింది నిజాం రాజ్యం కాదా? హైదరాబాద్ ట్యాంక్‌బండ్ కింద గల నేటి ఎ.వి. కాలేజీని నిజాం రాజు అనుమతితో తెలుగువాళ్లు స్థాపించుకో గలిగారు. నిజాం రాజు 1927లో జగిత్యాలలో హైస్కూలు స్థాపిస్తే అక్కడి డిగ్రీ కాలేజీ పెట్టడానికి ప్రభుత్వం 1966 దాకా ఆగాల్సి వచ్చింది. ఇదీ ప్రజా ప్రజాప్రభుత్వాల తీరు. స్థానికంగా ఉన్న దొరలు, భూస్వాములు, పట్వారీలు చేసిన దౌర్జన్యాలను కప్పిపుచ్చుకోవడానికి గాను నిజాం రాజు యొక్క నిజమైన చరిత్రను మరుగుపడేయడం జరిగిందని ఇవన్నీ నిరూపించడం లేదా? యునాని, ఆయుర్వేద వైద్యులను రిజిస్టర్డ్ మెడికల్ ప్రాక్టిషనర్స్‌గా నిజాం రాజ్యం గుర్తించింది. అలా గుర్తించిన ఏడు వేల మంది ఆయుర్వేద వైద్యులలో ఆరు వేల మంది బిసిలకు చెందినవారే. కానీ ప్రజా ప్రభుత్వం అల్లోపతి వైద్యుల గుర్తింపునకు ప్రాధాన్యమిచ్చి దేశీయ వైద్య విధానాలను కాలరాచింది. నిజాం రాజ్యం ఆధునిక పరిశ్రమల వల్ల దెబ్బ తింటున్న కులవృత్తుల వారికి ఆయా కులవృత్తులకు అనుసంధానంగా ఆధునిక టెక్నాలజీ శిక్షణను ఏర్పాటు చేసింది. కులవృత్తి సంఘాలను రిజిష్టర్ చేసుకొని చేనేత మొదలైన వృత్తి కులాలకు సబ్సిడీపై నూలు, తదితర ముడిపదార్థాలను అందించే విధానాలను అమలు చేసింది. బొంబాయి రాష్ట్రానికి వలస వెళ్లుతున్న చేనేత వృత్తిపనివారి వలసలను తగ్గించి వారికి స్థానికంగా ఉపాధి కలిగించడం కోసం నిజాం రాజ్యం ఆజంజాహి వంటి మిల్లులను స్థాపించింది. ప్రముఖ సోషలిస్టు నాయకుడు బద్రీ విశాల్ పిట్టి తండ్రి ఆధ్వర్యంలో బట్టల మిల్లును స్థాపింపజేయడం జరిగింది. స్టేట్ బ్యాంకును, నిజాం రైల్వేస్‌ను నెలకొల్పడం జరిగింది. మంచినీటి సరఫరా ఏర్పాట్లు చేయడం జరిగింది. మంచినీళ్లపై పన్ను వేయాలని వచ్చిన సూచనకు నిజాం రాజు ఆశ్చర్యపోయి మంచినీళ్లపై పన్ను వేసి వసూలు చేయడమా అంటూ అలా చేయడాన్ని చాలా అవమానకరంగా ఫీలయ్యాడు. ఉచితంగా మంచినీటి సరఫరాను అందించాడు. నిజాం రాజ్యం ప్రపంచంలోనే వంద దేశాల కన్నా పెద్దది. నేటికీ తెలంగాణ ప్రాంతం ప్రపంచంలో వంద దేశాల కన్నా పెద్దది. దేశంలో 15 రాష్ట్రాల కన్నా పెద్దది. జనాభాతో పోలిస్తే ఆస్ట్రేలియా కన్నా పెద్దది. ప్రపంచంలో ప్రతి 200 మందిలో ఒకరు తెలంగాణావారే. ఇంకా ఇలాంటి ఎన్నో చారిత్రకాంశాలను వెలికి తీయవలసే ఉంది. ప్రస్తుతం సాహిత్య చరిత్ర రంగంలో, తెలంగాణ సాంస్కృతిక రంగంలో అమలైన అణచివేతను ప్రశ్నించే పరిమితులకు లోబడి– 1995 నుంచి మూడవ సారి ప్రత్యేక తెలంగాణ చిన్న రాష్ట్రాల ఉద్యమ దృక్పథంతో– వెలికి తీసుకువచ్చే క్రమంలో తెలంగాణ సాహిత్యాన్ని భాషను, సంస్కృతిని దానికే ప్రత్యేకంగా విశిష్ట అధ్యయన పద్ధతులతో సిద్ధాంతాలతో సూత్రీకరించవలసి ఉందని అందరూ గుర్తించారు. అందులో భాగంగా వెలువడుతున్నదీ సంకలనం.

ఈ సంకలనం విభిన్న సందర్భాలలో తెలంగాణ కోణంతో రాసిన వ్యాసాలతో సమీక్షలతో వస్తున్నది. విభిన్న సందర్భాలలో రాసినప్పటికీ వీటి మధ్య ఏకీకృత సూత్రం ఉంది. అది తెలంగాణ సాహిత్యాన్ని, చరిత్రను తనదైన ప్రత్యేక అస్తిత్వంతో, విశిష్టతతో అధ్యయన పద్ధతులతో నూతన శతాబ్దానికి అందించడం.

దక్షిణ భారతదేశ సాహిత్యంలో తెలంగాణ సాహిత్యం విశిష్టమైనది. ఇది తెలంగాణ ప్రాంతానికి పరిమితమైనది కాదు. ఉర్దూ, అరబ్బీ, ఇంగ్లీషు భాషల జాతీయ,

అంతర్జాతీయ స్థాయి వల్ల దక్కన్ పీఠభూమిలో బలమైన రాజ్యంగా ఉండడం వల్ల జాతీయ స్థాయి నుంచి ఇక్కడి సాహిత్యం, సంస్కృతి ప్రేరణ పొందుతూ సంపర్కం పెట్టుకొని కొనసాగుతూ వచ్చింది. గురజాడ, కందుకూరి కోస్తా సాహిత్యం సముద్రపుటంచుల నుంచి రైలు పట్టాల మీదుగా బెంగాల్ నుంచి ఉప్పును అందుకుని ఎదిగిన క్రమానికి చెందినవి. తెలంగాణ సాహిత్యం లక్నో, బొంబాయి, ఢిల్లీ, ఉత్తరప్రదేశ్, మహారాష్ట్ర, కర్ణాటక ప్రాంతాల సంబంధంతో ఎదిగింది. అందువల్ల తెలంగాణ ప్రాంతంలో హిందీ ప్రేమచంద్ తెలుగులో మొట్టమొదట అనువాదం చేయబడవలసిన వాడుగా మారాడు. అలా హిందీ మరాఠీ ఉర్దూ తెలంగాణ భాషల సాహిత్యం పరస్పర సంపర్కంతో అభివృద్ధి చెందిన క్రమం నైజాం రాజ్యానిది. భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పాటయిన తర్వాత రూపొందించిన భాషలవారి సాహిత్య సిద్ధాంతాలు, సూత్రీకరణలు, అధ్యయన పద్ధతులు, బహుభాషా రాష్ట్రాలకు, రాజ్యాలకు వర్తించవు. తెలంగాణ జీవితాలు ఉర్దూలో, హిందీలో, మరాఠీలో, కన్నడలో, బెంగాలీలో చిత్రించబడిన తీరుతెన్నులన్నింటినీ ఇప్పుడు వెలికి తీసుకురావాల్సిన అవసరం ఉంది. ఐదు భాషల రాజ్యం కావడం వల్ల నైజాం రాజ్యం నుంచి హైదరాబాద్ బడీచౌడీ కేంద్రంగా 'పంచధార' అనే త్రైమాసిక పత్రిక ఐదు భాషల సాహిత్యంతో వెలువడేది. ప్రేమచంద్ సమకాలికుడైన కిషన్‌చందర్ రాసిన **'జబ్ ఖేత్ జాగే'** నవలకు జైత్రయాత్ర అనే పేరుతో తెలుగు అనువాదం వెలువడింది. నర్సింగరావు తీసిన మా భూమి సినిమాకు మూలకథను ఈ నవలే అందించింది. అలాగే మరాఠీలో వెలువడి పలు భాషల్లోకి అనువాదం కావడంలో భాగంగా తెలుగులోకి వచ్చిన గాంధారి, ఉచల్య నవలలు నిజామాబాద్, ఔరంగాబాద్ ప్రాంతాలకు చెందిన తెలంగాణ ప్రజల జీవితాలకు సంబంధించినవే. 1948లో తమిళంలో రాసిన 'జంటనగరాలు' అనే అశోక మిత్రన్ గారి నవల తెలంగాణ జీవితాలకు సంబంధించిందే. ప్రముఖ చిత్రకారుడు చిత్తరంజన్ దాస్, ప్రఖ్యాత కవి హరీంద్రనాథ్ ఛటోపాధ్యాయ తెలంగాణ జీవితాల గురించి చిత్రించారు. ఉర్దూలో ఎంతగా చిత్రీకరణ పొందిందో ఇంకా వెలికి తీయవలసే ఉన్నది. ఇలా తెలంగాణ ప్రజల జీవితం సాహిత్యం తెలుగు భాషతో పాటు ఇతర భాషల్లో వెలువడడం తెలంగాణ భాష సంస్కృతి చరిత్ర పరిణామాల విశిష్టతను, వ్యాప్తిని తెలియజేస్తున్నది. అట్లా ఈగ ఇల్లలుకుతూ మర్చిపోయిన తన పేరును తిరిగి తెలుసుకుంటున్న క్రమమే ఈ సంకలనం.

ఈ సంకలనం అనేక విశిష్టతలను, ప్రత్యేకతలను కలిగి ఉన్నది. మొట్టమొదటగా తెలుగు పేరిట భాషావాద చారిత్రక దృక్పథాన్ని ఖండిస్తూ స్థలకాల నిర్దిష్టతల దృక్పథాన్ని ఈ సంకలనం మన ముందుకు తెచ్చింది. సిద్ధాంత చర్చల ఆధిపత్య వాదంతో అణగదొక్కిన అధ్యయన పద్ధతిని పూర్వ పక్షం చేస్తూ సిద్ధాంతం కన్నా జీవితం ప్రాథమికమనే అధ్యయన పద్ధతిని ఈ సంకలనం పునఃస్థాపించింది. వలసవాదులు ఏ దేశంలోనైనా తమ వలస ఆధిపత్యానికి లోబడి ఉండే విధంగా స్థానిక జాతుల భాషల చరిత్రను పరిశీలిస్తారు. ఆంగ్లేయులు భారతదేశం పట్ల ఇదే వైఖరిని అవలంభించారు. అరబ్ దేశాల నుంచి వలస వచ్చినవాళ్లు కూడా ఇదే వైఖరి తీసుకున్నారు. ఇంకా ముందుకు వెళ్తే వలసవచ్చిన ఆర్యులుకూడా భారతీయ జాతులపై, ప్రజలపై ఇదే వైఖరి తీసుకున్నారు. పరిపాలనాదక్షతను దృష్టిలో ఉంచుకొని నిజాం రాజులు ఉత్తరాది వారి నుంచి ఆహ్వానించి ఉద్యోగమిస్తే స్థానికుల గురించి ఇదే పని చేశారు. కోస్తా ప్రాంతవాసులు కూడా ఇందుకు భిన్నంగా ప్రవర్తించడం జరగలేదు.

అయితే స్థానికులపై స్థానికేతరుల పెత్తనాన్ని నిజాం రాజ్య ప్రజలు, ఉద్యోగులు ఎప్పటికప్పుడు ఎదిరిస్తూనే ఉన్నారు. కనీసం 400 యేళ్లుగా ఈ పని చేస్తున్నారని పి. లోకేశ్వర్, శోభాగాంధి గారలు చరిత్రను వెలికి తీసి ముల్కి ఉద్యమ చరిత్రగా మన ముందుంచారు. 1912 నుంచి కోస్తా సాహిత్య చరిత్రకు సమాంతరంగా తెలంగాణ సాహిత్య చరిత్ర కొనసాగిందని మాడపాటి హనుమంతరావు, సురవరం ప్రతాపరెడ్డి, గోలకొండ సంచిక మొదలుకొని తెలంగాణ తోవలు, తెలంగాణ కథ-దేవులాట, భౌగోళిక సందర్భం, ఫాయిదా, కరీంనగర్ జిల్లా కథలు, ముదిగంటి సుజాతరెడ్డి సంపాదకత్వంలో వెలువడిన తెలంగాణ తొలితరం కథలు సంకలనం దాకా స్పష్టం చేస్తున్నాయి.

ప్రాంతీయ విభేదాలు, అణచివేత చర్చ స్థానే స్థానిక దేశీయ సాహిత్యాన్ని వెలికి తీసి అందిస్తూ ఇక నుంచైనా పోటీ పడి అక్షరబద్ధం చేయాలనే ధ్యాసతో తెలంగాణ సామాజిక శాస్త్రవేత్తలు, రచయితలు పని చేస్తున్నారు. అందులో భాగంగా జిల్లాలవారీగా సాహిత్య సంకలనాలు వెలువరించాలని, సిద్ధాంత చర్చకు బదులుగా ప్రక్రియల పరంగా కృషి విస్తరించాలని కరీంనగర్ జిల్లా కథల రెండు సంకలనాలను ఆధునిక కథాసరిత్సాగరం పేరుతో వెలువరించడం జరిగింది. ఇతర జిల్లా సంకలనాలకు కూడా ప్రయత్నాలు సాగుతున్నాయి. ఏటా తెలంగాణ కథల నుంచి ఎన్నిక చేసిన కథలతో సంకలనాలు ప్రచురించాలని కాసుల ప్రతాప రెడ్డి, స్కైబాబ, ముదిగంటి సుజాతారెడ్డి తమ ప్రయత్నాలు ప్రారంభించారు. తెలంగాణ కథా వేదిక,తెలంగాణ పాటకవుల వేదిక, తెలంగాణ జర్నలిస్టుల వేదిక వంటి ప్రక్రియాపరమైన వేదికలను ఏర్పరిచి నిశబ్దంగా తమ కృషిని తాము కొనసాగిస్తున్నారు. తెలంగాణ రచయితల వేదిక తెలంగాణ భావజాలాన్ని తనదైన పరిమితులతో ముందుకు తీసుకొని వెళ్లి యువతరానికి ఉత్తేజాన్ని అందిస్తున్నది. వీటి కన్నా ముందే తెలంగాణ సాంస్కృతిక వేదిక తరఫున అంబటి సురేంద్రరాజు, సుంకిరెడ్డి నారాయణ

రెడ్డి, కె. శ్రీనివాస్, కాసుల ప్రతాప రెడ్డి, ఎస్. రామకృష్ణ, ఎస్. జగన్ రెడ్డి, కె. కృష్ణమూర్తి, శోభ మొదలైనవాళ్లు తెలంగాణ దేశీయ విశిష్ట దృక్పథాన్ని అందించడానికి కృషి చేశారు. తద్వారానే కాంగ్రెస్, వామపక్ష, ఫెమినిస్టు, కోస్తా క్యాంపుల తాలూకు చారిత్రక దృక్పథాలకు భిన్నంగా బహుజన సమాజ దృక్పథంతో తెలంగాణ చరిత్రను సంస్కృతిని అధ్యయనం చేసే అప్రోచ్, మెథడాలజీ సిద్ధాంత ప్రాతిపదికలు రూపుదిద్దుకున్నాయి. జొన్నరొట్టె, వట్టిచాపల కూర భోజనంతో హైదరాబాద్ రెడ్డి హాస్టల్ ఆడిటోరియంలో సదస్సు నిర్వహించి, శాలువాలకు బదులు గొంగళ్లు కప్పి తెలంగాణ పెద్దలకు సన్మానం చేసి జానపద ప్రజల పక్షం వహించారు. ఆయా ప్రాంతాల, స్థానిక జాతుల ప్రత్యేక సంస్కృతిని, ఆచారవ్యవహారాలను, వైద్యవిధానాలను, జీవిత దృక్పథాలను, విధానాలను పరిరక్షించుకుంటూ పరిణతి చెందించుకుంటూ ముందుకు సాగడం ద్వారానే గ్లోబలైజేషన్, ప్రైవటైజేషన్, లిబరైలేజేషన్ క్రమాలకు నిలువరించడం సాధ్యమవుతుందనే అంతర్జాతీయ దృక్పథాన్ని తెలంగాణ సాంస్కృతిక వేదిక బలంగా ప్రతిపాదించింది. గ్లోబలైజేషన్‌కు వ్యతిరేకంగా గాలిలో కత్తులు దూసినట్లుగా జనాంతికంగా అరవడం ద్వారా చేయగలిగేదేమీ లేదని ఆయా ప్రాంతాల నిర్దిష్ట సామాజిక ఉద్యమాలు అస్తిత్వ పోరాటాలు అందుకు పరిష్కారాలని వేదిక స్పష్టం చేసింది. కానీ కొందరు ఈ విషయాన్ని మరుగు పెట్టి కోస్తావాదులు వలసవాదులు ఇవాళ గ్లోబలైజేషన్‌కు వ్యతిరేకంగా కూడా తామే మాట్లాడుతున్నట్లు విదూషక ప్రదర్శన గావిస్తున్నారు. తెలంగాణ సాంస్కృతిక వేదిక, తెలంగాణ బహుజన సమాజం ముందుకు తెచ్చిన సైద్ధాంతిక చర్చ మార్క్సిజాన్ని అంబేద్కరిజాన్ని ప్రజాస్వామిక రాజ్యాంగ స్ఫూర్తిని ఫెమినిజాన్ని మానవతావాదాన్ని సమన్వయ పరిచి ప్రజాస్వామ్య పద్ధతుల్లో బహుళ పార్టీ వ్యవస్థలో సాధ్యమయ్యే తీరును ముందుకు తీసుకొని రావడం జరిగింది. అందువల్ల ఆయా వాదాలకు ప్రతినిధులుగా పీఠాధిపతులుగా ఉన్న సంఘాలకు సంస్థలకు వ్యక్తులకు తెలంగాణ సాంస్కృతిక వేదిక తెలంగాణ భావజాల కర్తలు బద్ధశత్రువులయ్యారు. తెలంగాణలోనే కాకుండా మొత్తం దేశంలోనే భావజాల చర్చలో తమ ఆధికత్యను కోల్పోయిన దోపిడీకులాల, దోపిడీ ప్రాంతాల నాయకులు సంఘాలు గత పన్నెండేళ్లుగా 1990 నుంచి విభిన్న రకాలుగా తిరిగి తమ పెత్తనాన్ని నెలకొల్పుకోవడం కోసం ఎత్తుగడలు వ్యూహం, ఎత్తులకు పైయెత్తులు ప్రారంభించారు. అట్లా జరిగిన దాడిలో భాగంగా కొందరు దళితవాదం ద్వారా కొందరు నక్సలిజం ద్వారా మరికొందరు ఫెమినిజం పేరిట వలసవాదుల ప్రయోజనాలకు అనువుగా తెలంగాణ అస్తిత్వ పోరాటాలను కుదించి తమకు అనుకూలమైన విభీషణ సంతతి నాయకత్వం తెలంగాణలో ఏర్పాటు చేయడానికి కృషి చేశారు. అలా తెలంగాణ వాళ్ల నుంచి తమకు అనుకూలమైన దళారీ రచయితలను కళాకారులను మేధావులను పత్రికారచయితలను ప్రశంసించడం ద్వారా ప్రోత్సహించడం ద్వారా అసలైన బహుజన సమాజ తెలంగాణ రచయితలను కళాకారులను పత్రికారచయితలను వెనక్కి నెట్టేయడం ప్రారంభించారు. వర్గ, స్త్రీవాద రూపాల్లో, విప్లవ ప్రజానీకానికి మద్దతు రూపంలో ఇవాళ తెలంగాణ రచయితలపై, సమాజంపై కోస్తావాదుల ఆధిపత్యాన్ని నెలకొల్పే ప్రయత్నాలు చేస్తున్నారు. ఇందులో వాళ్లు కొంత మేరకు విజయం సాధించారు కూడా. తమకు నచ్చనివారి పట్ల వ్యక్తిత్వ హత్యాకాండ (క్యారెక్టర్ అసాసినేషన్) ఎత్తుగడలతో తెలుగు సాహిత్య రంగాన్ని విషపూరితం చేశారు. బి.యస్. రాములు, గద్దర్, గూడ అంజయ్య, నారగోని, కంచె ఐలయ్య, మాష్టార్జీ మొదలైనవారిపై తొలివిడతగా ఈ దాడి జరిగింది. మలివిడతగా కోస్తావారి ఆధిపత్యంలో దళితవాదం రూపంలో తెలంగాణ దళితవాద సిద్ధాంతకర్తలపై దాడి జరిగింది. చాలా పకడ్బందీగా తెలంగాణ నుంచి ఫెమినిస్టు రచయితలు ఎదకుండా చేశారు. కథాసంకలనాల్లో ఒకటి అరా తెలంగాణ కథలు చేర్చి వారి దయాదాక్షిణ్యాల కోసం తెలంగాణ రచయితలు పడిగాపులు పడే విధంగా వారిని న్యూనతా భావానికి గురి చేశారు. ఎదిరించినవారికి స్థానం లేకుండా చేశారు. చర్చ మరింత పదునెక్కినప్పుడు తెలంగాణ ప్రాంతం విప్లవ కథలు తప్ప మిగతా ప్రజల జీవితాల చిత్రీకరణను సాహిత్యంగా గుర్తించబోమని నిస్సిగ్గుగా ప్రకటించుకున్నారు. తద్వారా వాళ్లు నక్సలైట్ ఉద్యమానికి మద్దతు ఇస్తున్న ఫోజు కొట్టి ఆధిక్యతను సంపాదించాలనుకున్నారు. కానీ చరిత్ర అలా జరగలేదు. ఎన్నో కథా సంకలనాలు తెలంగాణ కథ ప్రాధాన్యతను గుర్తించి స్వీకరించి వెలువడ్డాయి. ఇవాళ తెలంగాణ సాహిత్యం ఆఫ్రికన్ సాహిత్యం వలె అంతర్జాతీయ స్థాయిని అందుకున్నది. అందుకు దారులేసిన క్రమంలో చీరుకుపోయిన గాయాలతో క్షతగాత్రులైన యోధులు, తెలంగాణ భావజాలకర్తలు ఇంకా బాధపడుతూనే ఉన్నారు. అందువల్ల గాయపడిన యోధులను యువతరం తమ నాయకులుగా తమకు దారి చూపినవారిగా అక్కున చేర్చుకుని చరిత్రను లిఖించాల్సి ఉన్నది. అలా క్షతగాత్రులైనవారిలో ప్రతాప రెడ్డి కూడా ఒక్కరు. అతనికైన గాయాలేమిటో, అతనికి ఆ గాయాలు ఎందుకయ్యాయో, అతని వ్యక్తిత్వ హత్యాకాండ ఎందుకు జరిగిందో, ప్రతాపరెడ్డిని దాడికి కేంద్రంగా ఎందుకు చేసుకోవాల్సి వచ్చిందో ఈ వ్యాసాలు సాక్ష్యమిస్తాయి. ఇందులోని వ్యాసాలు ఎవరినీ ఎందుకు ఎలా విమర్శించాయో అందులోని సహేతుకతను చర్చించకుండా అసందర్భ చర్చలతో సైద్ధాంతిక చర్చను పక్కదారి పట్టించి కృషి చేసిన తీరు ఎలాంటిదో ఈ వ్యాసాలు చదివివాళ్లు అంచనా వేసుకోవచ్చు.

కంచె ఐలయ్య తెలంగాణ జీవితాన్ని సిద్ధాంతీకరించి ఇంగ్లీషులో రాయడం వల్ల అంతర్జాతీయ స్థాయిలో గుర్తింపు పొందారు. 'వై ఐ యామ్ నాట్ ఎ హిందూ'

అనే ఈ గ్రంథం ప్రపంచంలోని 12 విశ్వవిద్యాలయాల్లో పాఠ్యగ్రంథమైంది. ఆ గ్రంథం అతన్ని అంతర్జాతీయ వేదికల మీద వందలాది ప్రసంగాలు చేయడానికి ఆహ్వానాలను అందుకునేట్లు చేసింది. ఇవాళ్ల కంచె ఐలయ్య ప్రపంచ భావజాల కర్తల్లో ఒకరయ్యారు. తెలంగాణ కథలు హిందీ ఇంగ్లీషుల్లోకి అనువాదమై జాతీయ అంతర్జాతీయ దృష్టిని ఆకర్షిస్తున్నాయి. గద్దర్, గూడ అంజయ్య, జి.వై. గిరి, భూపాల్, మాష్టార్జీ, సుద్దాల అశోక్‌తేజ, వడ్డెపల్లి కృష్ణ, వల్లంపట్ల నాగేశ్వరరావు, అందెశ్రీ, గోరటి ఎంకన్న, గ్యార యాదయ్య, కె. రామలక్ష్మణ్, కె. సీతారాములు జాతీయ స్థాయిలో గుర్తింపు పొందారు. ఇవాళ వీరి పాటలు తెలుగువాళ్లున్న ప్రపంచ దేశాలన్నింటా చేరిపోయాయి. పలు భాషల్లోకి అనువదించబడ్డాయి. ఈ చరిత్రను తెలుగు సాహిత్య చరిత్ర ఇంకా రికార్డు చేయవలసే ఉన్నది. తెలంగాణ నుంచి ఎదిగే రచయితలు కళాకారులు బహుజన కులాలవాళ్లు కావడం వల్ల కూడా తెలంగాణలోని, ఇతర ప్రాంతాల్లోని దోపిడీ కులాల నాయకత్వాలకు, పీఠాధిపతులకు మింగుడు పడడం లేదు. తెలంగాణ ఎదుర్కుంటున్న ప్రధాన సమస్యల్లో ఇది కూడా ఒకటి. అందువల్ల ఇక్కడ తెలంగాణలో కులం చర్చ కూడా అనివార్యమవుతున్నది. ఇప్పుడిప్పుడే ఎదుగుతున్న తెలంగాణ దోపిడీ కులాల పత్రికారచయితలు తెలంగాణ బహుజన సాహిత్యాన్ని వెనక్కి నెట్టి కోస్తా దళితవాద సాహిత్యాన్ని ఫెమినిస్టు వర్గవాద విప్లవవాద సాహిత్యాన్ని గ్లోబలైజేషన్ సాహిత్యాన్ని ప్రమోట్ చేస్తున్న పేరిట తమ స్వార్థపూరిత స్వప్రయోజనాలను కాపాడుకుంటున్నారు. ఇవాళ లిఖితబద్ధం కాని ఈ చరిత్రనంతా లిఖితబద్ధం చేయాల్సే ఉన్నది. చరిత్ర అంతా వర్గపోరాటాల చరిత్రే అనేవాళ్లు కూడా చాలా కన్వీనియెంట్‌గా ఈ విషయాన్ని కప్పిపెడుతున్నారు.

కాసుల ప్రతాప రెడ్డి 'వాళ్లు- మనం' అనే వ్యాసం ప్రారంభంలోనే అన్నట్టుగా 'ఇవాళ్ల తెలంగాణ సాహిత్యకారులు ఆత్మపరిశీలనలో పడ్డారు. ఇంత వరకు తాము సృష్టించిన సాహిత్యాన్ని చేసిన ఆలోచనలను నమ్మిన సిద్ధాంతాలను వెనక్కి తిరిగి చూసుకుంటున్నారు... తాము ఇంత వరకు ఎవరిని మోసావో అర్థం చేసుకుంటున్నారు.... తమ ప్రాచీనులకు సాహిత్య చరిత్ర రచనలో నష్టం జరిగిందన్న విషయాన్ని వారు ఇప్పుడు బయట పెట్టదలుచుకున్నారు.... తెలుగు సాహిత్యానికి వాదాల, సిద్ధాంతాల గొడవ ఎక్కువ. ఎప్పుడు ఏ వాదన బలంగా ముందుకు వస్తే అందుకు అవసరమైన సాహిత్యం కూడా పుట్టుకొస్తుంది. ఇలా పుట్టుకరావడం సహజం కూడా'. నిజానికి ఇది భావజాల బానిసత్వాన్ని తెలియజేస్తున్నది. సిద్ధాంతాన్ని ముందు పెట్టి సాహిత్యం తర్వాత రావడమనేది రచయితల పరాధీనతను తెలియజేస్తుంది. అదే సమయంలో సిద్ధాంతవేత్తల, భావజాల కర్తల ప్రాధాన్యతను తెలియజేస్తుంది. మొదటిదశలో జీవితాన్ని పరిశీలించడానికి సిద్ధాంత బలం అవసరమైనప్పటికీ రచయితలు మలిదశలో తమకు తామే జీవితాన్ని, సమాజాన్ని అధ్యయనం చేసి సూత్రీకరించాల్సి ఉన్నది. ఈ మలిదశ సాహిత్యం తెలుగులో పెద్దగా రాలేదు. 1985 నుంచి ఈ మలిదశ సాహిత్యం వేగం పుంజుకున్నది. సిద్ధాంతాల గొడవ ఉన్నంత కాలం వచనకవులు సాహిత్య విమర్శకులు సాహిత్య చరిత్రలో సింహభాగం ఆక్రమిస్తారు. జీవితం ప్రధానమైనప్పుడు కథ, నవల, నాటకం, సినిమా ప్రక్రియల రచయితలు ప్రధానమవుతారు. హిందీలో ప్రేమ్‌చంద్, రష్యాలో టాల్‌స్టాయ్, తెలుగులో శ్రీపాద- ఇట్లా జీవితం ద్వారా సిద్ధాంతాలను సూత్రీకరించుకునే చూపును తమ రచనల ద్వారా అందించారు. పశ్చిమ బెంగాల్‌లోను, కేరళలోను, ఆంధ్రప్రదేశ్‌లోనూ మొదటి నుంచి వామపక్ష భావజాల ప్రభావం బలంగానే కొనసాగుతున్నది. బెంగాల్‌లో, కేరళలో గొప్ప గొప్ప కథలు, నవలలు, సినిమాలు వచ్చాయి. ఆంధ్రప్రదేశ్‌లోనే ఎందుకు రాలేదు? సిద్ధాంత చర్చ ప్రాథమికమై జీవితం సమాజం సెకండరీ కావడం వల్ల సాహిత్య సంఘాలు, పత్రికారచయితలు, పీఠాధిపతులు వచనకవిత్వానికి అనుంగు పుత్రులు కావడం వల్ల తెలుగు సాహిత్యానికి ఎనలేని నష్టం జరిగింది. అందువల్ల తెలంగాణ సాహిత్యానికి, తెలంగాణ సాహిత్యకారులకు సిద్ధాంత బలాన్ని కూడా ఎదిరించే అదనపు కర్తవ్యం మీద పడింది. ఆ బరువు కింద నలుగుతున్న వారిలో అంబటి సురేంద్రరాజు, బి.యస్. రాములు, ప్రతాప రెడ్డి, కాలువ మల్లయ్య, కె. సీతారాములు మొదలైనవాళ్లు ఉన్నారు. వీళ్లు కూడా తెలుగు పరిధిని వదిలి అనువాదాలతోనైనా ఇతర భాషల్లోకి విస్తరించినప్పుడు కంచె ఐలయ్యలా జాతికి, ప్రపంచానికి కూడా మార్గదర్శం చేసినవాళ్లుగా ప్రపంచం హృదయానికి హత్తుకుంటుంది. అందువల్ల మనది కాని క్షేత్రంలో పోరాడటం ఎత్తుగడల రీత్యా వీరులకు తగనిది. అయితే అప్పటికే కాల్చుకుని కాళ్లు విరిగినవాళ్లు కూడ ఉన్నారని ఈ వ్యాసాలు స్పష్టం చేస్తాయి. వాళ్లందరి గురించి పట్టించుకోవడమే ఈ సంకలనంలో వ్యక్తమవుతున్న ఏకసూత్రత.

ప్రతాప రెడ్డి అన్నట్టు 'విప్లవ సాహిత్య విమర్శ తెలంగాణలోని విప్లవోద్యమానికి దూరంగా ఉన్న వాళ్లను చూడనిరాకరించింది' సృజన, అరుణతార, నూతన, సాంస్కృతిక ప్రగతి, ప్రజాసాహితి, ర్యాడికల్ మార్చ్ వంటి పత్రికలు మొత్తం సంచికలు తిరిగేసినా తెలంగాణ మొత్తం ప్రజల గురించి గానీ, మొత్తం ప్రజల జీవితాల గురించి గానీ వ్యాసాలు, సాహిత్యం కనపడవు. ఇప్పటికీ ఈ పత్రికలలో ప్రజల పక్షం వహించిన ప్రజాసాహిత్యాన్ని పట్టించుకున్న దాఖలాలు కనపడవు.

ఇక దళితవాదం విషయానికి వస్తే బొజ్జా తారకం, కత్తి పద్మారావు, కంచె ఐలయ్య, మాష్టార్జీ, నలుపు, ఎదురీత పక్ష పత్రికలు, దళితవాయిస్, గోదావరి కెరటాలు, దళితరాజ్యం మాసపత్రికలు, బి.యస్. రాములు, నారగోని తదితరులు సిద్ధాంత

చర్చను ముందుకు తెచ్చి ఒక దారి ఏర్పరిచిన తర్వాత నలిగిన దారిలో నడవడం కోసం బయలుదేరిన రెండవ తరం వీరి కాంట్రిబ్యూషన్ గురించి రాయకుండా తామే ఆద్యులమైనట్లు మాట్లాడడం మొదలుపెట్టారు. జి. లక్ష్మీనరసయ్య, త్రిపురనేని శ్రీనివాస్, మొదలైన కాలమిస్టులు పత్రికారచయితలు పత్రికల ద్వారా ఒక భ్రమను కలిగింపజేశారు. దళిత రచయితల కళాకారుల మేధావుల ఐక్యవేదిక నిర్మాణం ద్వారా తెలుగు సాహిత్యంలో దళితవాదం స్థిరపడిందనేది నిర్వివాదమైన అంశం. కానీ వీళ్లెవరూ ఈ విషయాన్ని ఇప్పటికీ అక్షరబద్ధం చేయలేదు. వీళ్ల స్వార్థపూరిత కెరీరిజానికి ఇది పరాకాష్ట. సత్యాన్ని తెలిసి ఉండి కూడా చెప్పకపోవడం అసత్యాలను చెప్పడం కన్నా తక్కువ నేరమేమీ కాదు. దరకమే ఐక్యవేదిక నిర్మాణం తర్వాత దళితవాదంలోకి వచ్చిన వచనకవులు ఐక్యవేదికలో చేరకుండా తమకు తామే ఒంటిస్తంభాలుగా నిలబడి కేంద్రం కావాలనుకున్నారు. అది మూడేళ్ల ముచ్చెటగా ముగిసిపోయింది. మాదిగదండోరా ఉద్యమం దరకమే ఐక్యవేదిక అందించిన సిద్ధాంత భూమిక నుంచి స్ఫూర్తి పొంది ముందుకు సాగింది. పర్యవసానంగా మాదిగ సాహిత్యం, మాదిగ సాహిత్య పరిషత్తు విస్తరించాయి. దండోరా ఉద్యమంతో ప్రేరణ పొందిన బిసి కులాల యువనాయకత్వం కదిలి ఆయా కులాల మహాసభలు నిర్వహించడం ద్వారా ఆయా కులాలకు సంబంధించిన సాహిత్యం, సిద్ధాంతాలు వెలుగులోకి వచ్చాయి. ఇట్లా ఉద్యమాలు ప్రజలు రచయితలు కలిసిన సమయాల్లో తెలుగు సాహిత్యం విస్తరిస్తూ వస్తున్నది. కోస్తా దళిత కవులు పూర్వపు కాల్పనిక కవుల్లా తమ గతాన్ని తమ వారి గతాన్ని తమ గతంగా ఆపాదన చేసుకొని పలవరించారు. అయితే వాళ్లు వీళ్లలో చాలా మంది ప్రజలకు దూరమై తమదైన మధ్యతరగతి పరిధిలో కుదించుకుపోయి జీవిస్తున్నవాళ్లే ఎక్కువ. అందువల్ల గూడ అంజయ్య, మాష్టార్జీ వంటి దళితకవుల కృషి చరిత్ర వీరి కంటికి ఆనకుండా పోయింది. దీన్నంతా ప్రతాప రెడ్డి వాళ్లు-మనం వ్యాసంలో చాలా చక్కగా విశ్లేషించి చెప్పాడు. ప్రతాపరెడ్డి అన్నట్లు "మొత్తంగా సాహిత్యం స్థల నిర్దేశితం, ప్రాంతాలన్నీ ఒక్కటి కానట్లే, సాహిత్యమంతా ఒక్కటి కాదు. అంటే ఒకే భాషలో వెలువడిన సాహిత్యమంతా ఒక్కటి కాదు. ఇంకా చెప్పాలంటే ఒకే కాలంలో వెలువడిన తెలుగు సాహిత్యమంతా ఒక్కటి కాదు". ఒకే కులం పేరిట ఒకే వాదం పేరిట వెలువడిన సాహిత్యమంతా ఒకటి కాదని దానికి కూడా కులం వర్గం జాతి ప్రాంత పరిమితులు, ప్రత్యేకతలు అభివృద్ధి చెందిన ప్రాంతాల అణచివేతలు స్వవర్గంలో, స్వకులంలో స్వజాతిలో ప్రాంతాలవారీగా పీఠాధిపత్యాలవారీగా కొనసాగుతుంటాయని తెలుగు సాహిత్య చరిత్ర స్పష్టం చేస్తున్నది. "కోస్తాంధ్రులకు జీవితంలో పైమెట్టు అధిరోహించడానికి దళిత, స్త్రీవాదాలు సాధనాలుగా మారాయి. కెరీరిజంతో పైకెదగడానికి సోపానాలయ్యాయి. కానీ అవే సిద్ధాంతాలు తెలంగాణలో మొత్తం సమాజ విముక్తి కోసం పనికి రావాలని కోరేవారి చేతుల్లో కొనసాగుతున్నాయి".

అందువల్ల కమిట్‌మెంట్ చర్చతో పాటు నిమగ్నత చర్చ కూడా తెలుగుసాహిత్యంలోని దళితవాదంలో, స్త్రీవాదంలో, అభ్యుదయ విప్లవవాదాల్లో ఇప్పటికీ నిర్ణయకాంశమే. నిజానికి మాటలకు, చేతలకు మధ్య ఉండే వైరుధ్యాన్ని పరిష్కరించే రచయితలే చెప్పింది చేసే రచయితలే నిజాయితీ గలవాళ్లు అనేది చరిత్ర చెప్పిన సత్యం. కానీ తెలుగు సాహిత్యం విమర్శలను దీనికి పూర్తి భిన్నంగా కొనసాగుతున్నాయి. అందువల్ల ప్రతాపరెడ్డి కలం పట్టి దీన్నంతా ప్రశ్నిస్తున్నాడు. అందువల్ల "సైద్ధాంతిక వాస్తవికత- సామాజిక వాస్తవికత" అనే వ్యాసంలో ప్రతాపరెడ్డి ఈ చర్చను చేయడం అనివార్యమైంది. ప్రతాపరెడ్డిని బాగా బాధ పెట్టిన అంశమొకటి ఉంది. "తెలుగులోని చాలా రచనలు జీవితాలను, జీవిత వాస్తవికతను, అంతిమంగా సామాజిక వాస్తవికతను ప్రతిబింబించకుండా సైద్ధాంతిక వాస్తవికతను నిరూపించే రచనలుగా మిగిలిపోతున్నాయ"నేదే అతని బాధ. "మొత్తంగా తెలుగు సృజనాత్మక రచయితలు ఎక్కువ మంది నిబద్ధత గురించి మాట్లాడేవాళ్లు ఒక ప్రధానమైన అంశాన్ని విస్మరిస్తున్నారు. జీవితాన్ని, సమాజాన్ని అర్థం చేసుకుని విశ్లేషించే పనిముట్లుగా సిద్ధాంతాన్ని వాడుకోవాలనే అంశాన్ని గమనించడం లేదు. తమ సిద్ధాంతమే సత్యమని నిరూపించడానికి రచనలు చేస్తున్నారు." ప్రతాపరెడ్డి బాధ అందరి బాధ కూడా.

"రక్తం చేత రాగాలాపన" వ్యాసంలో ఈ బాధను శివారెడ్డి కవిత్వానికి అన్వయించి రాయడం వల్ల శివారెడ్డి మిత్రులు, అనుచరులు బాధపడ్డం సహజమే. కానీ అది సాకుగా ప్రతాపరెడ్డిపై దాడి చేయడం సాహిత్య విమర్శ అనిపించుకోదు. సాహిత్య విభేదాలను సాహితీకరించిన చర్చలోనే చర్చించి సాహిత్య విమర్శను పరిపుష్టం చేయాలి తప్ప వ్యక్తిత్వ హత్యాకాండ ద్వారా కాదు. విప్లవ కవిత్వానికి వరవరరావు ఒక ప్రతినిధి అవుతాడు. శివారెడ్డి వరవరరావు స్థానంలో విప్లవ ప్రతినిధిగా ప్రతిష్ఠించబడ్డ కాలం కొంత ఉంది. 1985 నుంచి 1990 వరకు గద్దర్, వరవరరావు, బి.యస్. రాములు మొదలైన విప్లవ సాహిత్య నాయకత్వం రహస్య జీవితంలోకో, జైళ్లకో వెళ్లడం వల్ల గొంతు మూగబోయింది. ఆ నిశబ్దతలో శివారెడ్డి వంటి ఎందరో కవులు రచయితలు విప్లవ సాహిత్య ఇమేజీని నిలబెట్టే కృషి చేశారు. అయితే కాలక్రమంలో అది వరవరరావు వచనకవిత్వాన్ని, సాహిత్యంలో, నిమగ్నతలో ఆయన ప్రాధాన్యతను పూర్వపక్షం చేసి శివారెడ్డి వంటి రూపవాదులు, మార్మికకవులు, కెరీరిస్టులు పెద్ద పీట వేయించుకోవడం జరిగింది. శివారెడ్డికి వచ్చిన కేంద్రసాహిత్య అకాడమీ అవార్డును కూడా ఈ దృష్టితోనే చూడవలసి ఉన్నది. ప్రతాపరెడ్డి "కె. శివారెడ్డి, ఓల్గా రచనలు చాలా వరకు గొంతు దిగని ఘనపదార్థాలు. శివారెడ్డి కవిత్వం విప్లవ సాహిత్యానికి చేసిన నష్టం ఇంతా అంతా కాదు" అని అంటూ

అదెట్లాగో వివరించాడు 'పాతకలోకం క్షమించదు గాక క్షమించదు" అనే వ్యాసంలో.

నిజమే. శివారెడ్డి ఏ భావజాలానికీ ప్రాతినిధ్యం వహిస్తున్నాడో దానికి గుర్తింపు ఇవ్వాల్సి వస్తే వరవరరావు అందుకు ప్రతినిధి అవుతాడు తప్ప శివారెడ్డి కాదు. కానీ వరవరరావు స్థానాన్ని శివారెడ్డితో పూరించిన సాహిత్య చరిత్ర మన కళ్ల ముందున్నది. ఇట్లా వచన కవిత్వంలో మొదలైన స్థానభ్రంశం (సబ్లేషన్) తెలంగాణ దళిత వాద సాహిత్యంలో, తెలంగాణ ఫెమినిస్టు సాహిత్యంలో, తెలంగాణ సామాజిక వాద సాహిత్యంలో కూడా కొనసాగుతూ వస్తున్నది. ఉదాహరణకు నవీన్, బోయ జంగయ్య, సదానంద శారద, కె.వి. నరేందర్, గుండెడప్పు కనకయ్య వంటి రచయితలు కోస్తాలో వచ్చి ఉంటే వారికి ప్రపంచ ప్రఖ్యాత రచయితల పక్కన పెద్ద పీట వేసి ఉండేవారు. తెలంగాణలో పుట్టడం వల్ల, తెలంగాణ వాళ్ల గురించి రాయడం వల్ల వాళ్లకు కనీస స్థాయి గుర్తింపు కూడా ఇవ్వడానికి కొందరు నిరాకరిస్తున్నారు. దాని వల్ల వారికి జరిగిన నష్టం కన్నా తెలుగు సాహిత్యానికి జరిగిన నష్టం ఎన్నో రెట్లు హెచ్చు. వరవరరావు వర్సెస్ శివారెడ్డి చర్చే కంచె ఐలయ్య, బి.యస్. రాములు వర్సెస్ జి. లక్ష్మీనరసయ్య మొదలైన దళిత వాద చర్చలో కూడా కొనసాగి తెలంగాణ వారికి సరైన స్థానం లేకుండా చేశారు.

"కవిత్వాలకు ఉద్యమాలు రాలవు" అనే శీర్షిక ఒక్కటి చాలు ప్రతాపరెడ్డిని కెరీరిస్టు వచనకవులు టార్గెట్ చేసుకోవాలనుకోవడానికి. ఇంత పెద్ద మాటన్న తర్వాత అంతదాకా ఆయా సామాజిక ఉద్యమాలపై ఆ భావజాలాలపై ఏనుగు మీద ఈగలు వాలినట్లుగా వాలి ఏనుగునే తాను నడిపిస్తున్నట్టుగా ఫోజు కొట్టినవాళ్ల నగ్నస్వరూపాన్ని ప్రజలకు చూపించిన తర్వాత ప్రతీకారం తీర్చుకోకుండా ఎలా ఉండగలరు? బి.యస్. రాములును కూడా వచన కవిత్వ ద్వేషి అని భావించేవాళ్లు ప్రచారం చేసేవాళ్లు ఇప్పటికీ ఉండడానికి కారణం కూడా ఇదే. నాకు వచన కవిత్వం మీద ద్వేషం లేదు. వచన కవిత్వం రాసే రచయితల వల్ల వారి సాహిత్య విమర్శ వల్ల తెలుగు సాహిత్యానికి జరిగిన నష్టం అపారమైనది. బెంగాలీ, కేరళ సాహిత్యాలతో ధీటుగా కథలు, నవలలు, సినిమాలు రాకపోవడానికి, రాకుండా చేయడానికి దిగంబర కవిత్వ చర్చ నుంచి ఇప్పటి దాకా వచన కవిత్వం, వచన కవిత్వ చర్చ ఎంత నష్టం చేయాలో అంత నష్టం చేశాయి. ఈ ధర్మకోపం తప్ప నాకు గానీ, ప్రతాపరెడ్డికి గానీ వచనకవుల పట్ల వ్యక్తిగత ద్వేషమేమీ లేదు. వచనకవులకు ప్రాధాన్యత తగ్గినప్పుడల్లా మొత్తం సాహిత్యమే స్తబ్దతకు గురైందనే మాస్ హిస్టీరియాను తెలుగు సాహిత్యంలో ప్రచారం చేయడం జరిగింది. దిగంబర కవిత్వానికి పూర్వం స్తబ్దత గురించి మాట్లాడేవారికి వట్టికోట, మహీధర వంటివారి గొప్ప రచనలు వెలువడ్డాయని తెలియదనుకోవాలా?

మహారాష్ట్రకు చెందిన శరత్‌పాటిల్ ప్రతిపాదించిన అంబేద్కరిజం, మార్క్సిజం వ్యాసాన్ని అనువదించి నలుపులో నేను ప్రచురించడం జరిగింది. దాన్ని ఆ తర్వాత గతితర్కం- అంబేద్కరిజం- మార్క్సిజం అనే పుస్తకంలో చర్చించడం కూడా జరిగింది. అంతకన్న ముందే వెలువడి సిద్ధాంత మూలాల్ని ప్రశ్నించిన గతితర్క తత్వదర్శన భూమిక గ్రంథం అన్ని పార్టీల్లో, అన్ని ఉద్యమాల్లో కలకలం సృష్టించింది. దరకమే ఐక్యవేదిక నిర్మాణం జరిగింది. ఈ నేపథ్యంలో కెరీరిస్టుగా బయలుదేరిన జి. లక్ష్మీనరసయ్య సొంత వాక్యం ఒక్కటైనా లేకుండా దేశీయ మార్క్సిజం అనే పదబంధాన్ని మాత్రం ప్రతిపాదించారు. ఉ. సాంబశివరావు, సత్యమూర్తి ఎదురీత పత్రిక ద్వారా వారి సంస్థ ద్వారా చేస్తున్న చర్చల నుంచే పాము చావకుండా కర్ర విరగకుండా అంబేద్కరిజం- మార్క్సిజం- సమన్వయం అంటూ దానికి దేశీయ మార్క్సిజం అని పేరును తగిలించారు. ఇది అంబేద్కరిజాన్ని అవమానించడమే. జి. లక్ష్మీనరసయ్య దళితవాదం పేరిట దేశీయ మార్క్సిజం అనే పదబంధాన్ని తీసుకురావడం ద్వారా అంబేద్కరిజానికి ఎనలేని నష్టం చేశారు. కంచె ఐలయ్య మార్క్సిజం భ్రమల నుంచి బయటపడి స్పష్టంగా అంబేద్కరిజం దృక్పథాన్ని ప్రాచుర్యంలోకి తెచ్చారు. దరకమే ఐక్యవేదిక ఏర్పడిన తర్వాత, బహుజన సమాజ్ పార్టీ ఉద్యమం ఉత్తేజం స్థిరపడ్డ తర్వాత కూడా ఈ దేశీయ మార్క్సిజం పదబంధాన్ని మార్చుకొని అంబేద్కరిజం అనే పదబంధాన్ని స్వీకరించాలని అతనికి తెలియకపోవడం కెరీరిజంలో భాగమే. అంబేద్కరిజం దేశీయ మార్క్సిజం కాదు. అది మార్క్సిజం వలె తనదైన ప్రత్యేక ప్రాపంచిక దృక్పథంతో సమస్త విలువలను సంస్కృతిని చరిత్రను దోపిడీని శాస్త్రాలను ప్రశ్నించి బహుళ పార్టీ ప్రజాస్వామిక వ్యవస్థలో భాగంగా బహుజన సమ్మతితోశాంతియుతంగా ప్రవర్తన తీసుకురావాలని బౌద్ధ సంస్కృతి వ్యక్తిగత జీవిత విధానం కావాలని నొక్కి వక్కాణిస్తుంది. దేశీయ మార్క్సిజం అనే పదబంధం ఈ అర్థాన్ని ఇవ్వక పోగా అంబేద్కరిజాన్ని తప్పుడు అవగాహనకు గురి చేస్తుంది. మార్క్సిజం యొక్క వ్యూహం ఎత్తుగడలు వేరు. అంబేద్కరిజం యొక్క వ్యూహం, ఎత్తుగడలు వేరు. అంబేద్కరిజం ప్రపంచాన్ని అర్థం చేసుకునే తీరు వేరు. మార్క్సిజాన్ని అర్థం చేసుకున్న తీరు వేరు. అందువల్ల దళితవాదానికి దేశీయ మార్క్సిజం ద్రోహపూరితమైంది. దీన్ని చర్చకు తెచ్చి ప్రతాపరెడ్డి తేనెతుట్టెను కదలించాడు. జూలూరి గౌరీశంకర్ తామేదో ఎస్సీల కోసం త్యాగం చేసినట్టు తద్వారా బిసిలకు తాము మేలు చేయలేకపోయినట్లు రాసుకోవడం ఆత్మవంచన, పరవంచన కూడా. సిద్ధాంత స్పష్టత లేకపోవడమే అతనిలోని భావ దారిద్ర్యానికి మూలం. తన కెరీరిజంలో భాగంగానే దళిత సాహిత్యోద్యమంపై బురద చల్లారు. నిజానికి వెనుకబడిన కులాల సాహిత్యానికి ఎస్సీల సాహిత్యానికి మధ్య వైరుధ్యం లేదు; సంఘర్షణ లేదు. చంద్రభాను

ప్రసాద్ బిసిల పట్ల చేస్తున్న చర్చ ఎస్సీలను, బిసిలను విడిగొట్టి ద్వేషాలు పెంచే చర్చ, సామాజిక స్థాయిలో కాస్తా వర్తిస్తుందే తప్ప సాహిత్యరంగంలో దాని పప్పులు ఉడకవు.ఎందుకంటే బిసి రచయితలు బిసి సామాజిక నాయకుల్లాగా ఎస్సీలకు ఎదంగా ఉండడం సాధ్యం కాదు. జూలూరి గౌరీశంకర్ 'వెంటాడే కలాలు' సంకలనానికి తన ముందుమాటతో బిసిలకు ఎనలేని అప్రతిష్టను సాధించి పెట్టారు.

దళితవాదంలో లాగే విప్లవవాదంలో లాగే తెలంగాణ రచయితలు ముస్లింవాద కవిత్వంలో కూడా వివక్షతను ఎదుర్కుంటున్న తీరుతెన్నుల గురించి ముస్లిం కవులకు లక్ష్మణ రేఖలు గీస్తున్న నిరింద్రియ మేధావులు' అనే వ్యాసంలో ప్రతాపరెడ్డి చర్చించాడు. ఇట్లా తెలంగాణలోని విప్లవ, దళిత, ముస్లిం, స్త్రీవాద సాహిత్యకారులకు, సిద్ధాంతకర్తలకు జరుగుతున్న అన్యాయాన్ని అమలవుతున్న వివక్షతను ప్రశ్నించడం ద్వారా మొత్తం తెలంగాణ ప్రజానీకానికి తనకు తెలియకుండానే ప్రతినిధిగా మాట్లాడే సమగ్ర దృక్పథం అతడిలో ఏర్పడిందని ఈ వ్యాససంకలనం స్పష్టం చేస్తున్నది. కాళోజీ తర్వాత మొత్తం తెలంగాణ సమాజాన్ని సొంతం చేసుకున్న వ్యక్తిత్వంతో, సమగ్ర దృక్పథంతో యువతరం నుంచి ఎదగాల్సి ఉన్నది. అట్లా ఎదుగుతున్న వారిలో కాసుల ప్రతాపరెడ్డి ఒకరు. దీనికి ఈ వ్యాసాలు సాక్ష్యం ఇస్తాయి.

'వాళ్లు- మనము- అతనూ' అనే వ్యాసంతో ఈ సంకలనం ముగియడం ఎంతో సందర్భోచితంగా ఉంది. ఏమంటే- ప్రతాపరెడ్డి మాటల్లోనే చెప్పాలంటే 'కాళోజీని యాది చేసుకుంటే తెలంగాణను యాది చేసుకున్నట్లే". కాళోజీ వెంట దాశరథి వెంట, సామల సదాశివ వెంట తెలంగాణ దశాబ్దాల చరిత్రను, పరిమాణాలను యాది చేసుకోవచ్చు. కాళోజీ జీవనది. అందువల్ల ఆయన నిరంతరం సామాజిక రంగంలో జీవనది లాగే ప్రవహించారు. ఇవాళ తెలంగాణ నుంచి వందలాది వేలాది కాళోజీలు పుట్టుక రావాలి. భావజాలం ఏదైనప్పటికీ భిన్నాభిప్రాయలు కలిగి ఉన్నప్పటికీ తోటి మనిషిని ప్రేమించడం కాళోజీ లక్షణం. సమస్త రకాల అన్యాయాలను ఎదిరిస్తూ పౌరహక్కుల కోసం మానవ హక్కుల కోసం గొంతునిచ్చి ప్రజాస్వామ్య వాదిగా నిలబడడమే అతని వ్యక్తిత్వం. తెలంగాణ నుంచి విప్లవోద్యమానికి భిన్నమైన అభిప్రాయాలతో ఎదుగుతున్న యువతరాన్ని విప్లవోద్యమ నాయకత్వం కూడా కాళోజీని చూసిన చూపుతోనే చూసి గౌరవించవలసి ఉంది. అందుకు విరసం వంటి పీఠాధిపతులు అడ్డంకిగా మారే అవకాశం ఎప్పుడూ ఉంటుంది. వారిని అధిగమించకపోతే విప్లవ నాయత్వమే నష్టపోతుంది.

కాసుల ప్రతాపరెడ్డి ఈ వ్యాస సంకలనానికి కొలుపు అనే పేరును ఎందుకుంచాడో ఈ పాటికి అందరికీ అర్థమయ్యే ఉంటుంది. ఇది తెలంగాణ కొలుపు. ఇది సిద్ధాంతాల కొలుపు. ఇది యాంటి గ్లోబలేజేషన్ కొలుపు. ఇది యాంటీ ఫాసిస్టు కొలుపు. ఇది ప్రజాస్వామిక కొలుపు. బహుశా ఈ దశాబ్దంలో తెలుగులో ఇన్ని వాదాలను వివాదాలను చర్చించిన మొదటి సంకలనం ఇది. అందువల్ల ఇది నూతన శతాబ్దానికి సిద్ధాంత చర్చలకు ఒక గొప్ప ఆధారాన్ని, అవకాశాన్ని తెలుగు సాహిత్యానికి కల్పిస్తున్నది. రాగద్వేషాలకు అతీతంగా వర్గకులప్రాంతీయ దురభిమానాలకు అతీతంగా సత్యనిష్టతో ఈ సంకలనాన్ని పరిశీలిస్తే తెలుగు సాహిత్యానికి ముమ్ముందు ఎంతో మేలు ఒనగూరుతుంది.

ఇలా తెలంగాణ సాహిత్యం, సిద్ధాంత చర్చ తెలంగాణ ప్రాంతీయ స్థాయిని అధిగమించి దక్షిణ భారత స్థాయిలోనే కాకుండా దేశవ్యాప్తంగానూ, అంతర్జాతీయ స్థాయిలోనూ తన ప్రభావాన్ని వేస్తూ ప్రపంచానికి తన కాంట్రిబ్యూషన్‌ను అందిస్తూ ప్రపంచానికి భావజాల రంగంలో నాయత్వం వహిస్తూ ఎలా ముందుకు కదులుతున్నదో ఈ చర్చ,ఈ చరిత్ర, ఈ సంకలనం స్పష్టం చేస్తున్నది. ఈ సంకలనాన్ని మరి కాస్తా సమగ్రం చేసి ఇంగ్లీషులో వెలువరిస్తే కంచె ఐలయ్య లాగా చర్చ అంతర్జాతీయ స్థాయికి చేరుతుందనడంలో సందేహం లేదు.

**బి.యస్ రాములు**

9-12-2002
హైదరాబాద్

# వాళ్ళూ - మనమూ

ఇవాళ తెలంగాణ సాహిత్యకారులు ఆత్మపరిశీలనలో పడ్డారు. ఇంత వరకు తాము సృష్టించిన సాహిత్యాన్ని, చేసిన ఆలోచనలను, నమ్మిన సిద్ధాంతాలను వెనక్కి తిరిగి చూసుకుంటున్నారు. తాము చేసిన పొరపాట్లు ఏమిటో తెలుసుకుంటున్నారు. సాహిత్యంలో కోస్తాంధ్ర ఆధిపత్యం తమను మరుగుజ్జులుగా మార్చి వేస్తున్న వైనాన్ని పసిగడుతున్నారు. తాము ఇంతవరకు ఎవరిని మోశామో అర్థం చేసుకుంటున్నారు. కోస్తాంధ్ర విమర్శకులు, సాహిత్యవేత్తలు వేసిన బాటలు తమకు తమను ఎంత దూరం చేశాయో, ఎలా పరాయీకరణకు గురి చేశాయో తెలుసుకుంటున్నారు. ఇప్పుడు చేయాల్సిందేమిటో ఆలోచిస్తున్నారు. ఇంతవరకు పాడిన పరాయిపాటను కాదని సొంత పాట పాడుతున్నారు. భాషను, యాసనే కాదు, జీవిత మూలాలను కోల్పోతున్నామని గుర్తించి తమ ఐడెంటిటీని కాపాడుకునేందుకు పురిటినొప్పులు పడుతున్నారు.

తమ ప్రాచీనులకు సాహిత్యచరిత్ర రచనలో నష్టం జరిగిందన్న విషయాన్ని వారు ఇప్పుడు బయటపెట్టదలుచుకున్నారు. దీనికి ఎవరినో నిందించాల్సిన అవసరం కూడా లేదని వారు భావిస్తున్నారు. తాము సరైన దారిలో లేనందువల్లనే ఈ నష్టం జరిగిందనేది వారి ఆలోచన. ఈ స్థితిలో ప్రస్తుత తెలుగు సాహిత్యాన్ని కూడా ఈ దృక్కోణం నుంచి చూడాల్సిన అవసరం ఉంది. తెలుగు సాహిత్యానికి వాదాల, సిద్ధాంతాల గొడవ ఎక్కువ. ఎప్పుడు ఏ వాదన బలంగా ముందుకు వస్తే అందుకు అవసరమైన సాహిత్యం పుట్టుకొస్తోంది. ఇలా పుట్టుకరావడం సహజం కూడా. అలా వచ్చినవాటిలో విప్లవ సాహిత్యానంతరం స్త్రీ, దళిత, ముస్లిం సాహిత్యాలు ముఖ్యమైనవి. ఈ ధోరణుల్లో తెలంగాణ సాహిత్య పాయ ఎలా వ్యక్తమైందనేది ఇప్పుడు పరిశీలించాల్సిన అవసరాన్ని కాలమే కల్పించింది. సాహిత్య విమర్శ కొలమనాలు సరిగా లేదనందున తెలంగాణా సాహిత్యాన్ని బేరీజు వేయడంలో అన్యాయమే జరుగుతోంది. తెలంగాణ సాహిత్య విమర్శకులు కూడా కోస్తాంధ్ర విమర్శకుల కొలమానాలతో సాహిత్యాన్ని బేరీజు వేసేంతగా మానసికంగా సంసిద్ధులయ్యారు. ఈ ప్రమాణాలను పక్కన పెట్టి తెలంగాణా సాహిత్యాన్ని కొత్త ప్రమాణాలతో, స్థానిక ప్రమాణాలతో చూడాల్సిన అవసరం ఉంది. నిజానికి, ప్రాచీన సాహిత్యాన్ని సంస్కృత

కొలమానాలతో, ఆధునిక తెలుగు సాహిత్యాన్ని పాశ్చాత్య కొలమానాలతో బేరీజు వేయడం అలవాటుగా మారింది. పాశ్చాత్య పండితుల మాటలను ఉటంకిస్తూ విమర్శ చేస్తే తప్పు విలువ లేని పరిస్థితి ఏర్పడింది.

విప్లవ సాహిత్య విమర్శ తెలంగాణలోని విప్లవోద్యమానికి దూరంగా ఉన్నవాళ్లను చూడనిరాకరించింది. విప్లవ సాహిత్య ఉధృతిలో మిగతా రచయితలు, కవులు కనిపించకుండా పోయారు. రాయలసీమలోనూ, కోస్తాంధ్రలోనూ, అంతగా చెప్పాల్సి వస్తే ఉత్తరాంధ్రలో కూడా ఈ స్థితి లేదు. కథాప్రక్రియ విషయానికి వస్తే సురవరం ప్రతాపరెడ్డి, వట్టికోట ఆళ్వారుస్వామిల పట్ల కూడా సాహిత్యకారులు అనుసరించిన వైఖరి చూస్తే ఎంత వివక్ష వెంటాడుతూ వస్తున్నదో అర్థం చేసుకోవచ్చు. పి.యశోదారెడ్డి, ఇరివెంటి కృష్ణమూర్తి, సురమౌళి, అంతా ఎందరెందరో మరుగున పడిపోయే పరిస్థితి దాపురించింది. నిన్న మొన్నటి వరకు అల్లం రాజయ్య, తుమ్మేటి రఘోత్తమరెడ్డికి ఎక్కడ లేని ప్రచారం ఉండేది. వీరిద్దరిని తలల మీదికి ఎత్తుకున్నట్లు నటిస్తూ మిగతా కథారచయితలను గుర్తించకుండా చేశారు. ఇప్పుడు వారిద్దరినీ కింద పడేసి ముందుకు సాగే ప్రయత్నంలో ఇతర ప్రాంతాల కథారచయితలు ఉన్నారు. విప్లవ కథను మోసే పెనుబాధ్యతను ఎత్తుకున్న సాహిత్య విమర్శకులు తెలంగాణ జీవనపరిస్థితులను, కుటుంబ సంబంధాలను, మానవ సంబంధాలను, మానసిక సంబంధాలను చిత్రించిన కథలను పక్కన పెట్టేశారు. రాయలసీమ కథారచయితలు గొప్పగా రాయలసీమ జీవితాన్ని చిత్రించారనే విమర్శకులు తెలంగాణ జీవితాన్ని కూడా చిత్రించిన కథారచన జరిగిందనే విషయాన్ని ఒప్పుకోవడం లేదు. ఈ కథను చూడ నిరాకరించారు; నిరాకరిస్తున్నారు. కథ విషయంలోనే కాదు కవిత్వం విషయంలోనూ ఇదే జరుగుతోంది. అర్థం కాదనే నెపంతో తెలంగాణ కవుల భాషను, యాసను వెనక్కి నెట్టే ప్రయత్నం చేస్తున్నారు. నిజానికి, భాష, యాస, మాట అలా ఉంచితే, కోస్తాంధ్ర సిద్ధాంతకర్తలు, విమర్శకులు ముందుకు తెచ్చిన దళిత, మైనారిటీ వాదాలు తెలంగాణలో ఒక రకంగానూ, కోస్తాంధ్రలో మరో రకంగానూ వ్యక్తమవుతూ వస్తున్నాయి. స్త్రీవాదానికి వస్తే తెలంగాణ కోణం మచ్చుకైనా కనబడదు.

1

తెలుగు సాహిత్యంలో స్త్రీవాదం ఒక ఉప్పెనలా వచ్చింది. విప్లవ సాహిత్యోద్యమంపై స్త్రీవాద సాహిత్యం ప్రశ్నలు సంధించింది. సమాజంలోని స్త్రీ వివక్షపై ప్రశ్నలు వేసింది. తన ఐడెంటిటీని నిలబెట్టుకుంది. అయితే, దీనికి పరిమితులున్నాయి. ఒకటి– ప్రస్తుతం చెలామణి అవుతున్న స్త్రీవాదంతో పల్లె స్త్రీలకు



పాత్ర లేకపోవడం, వారి సమస్యలను పట్టించుకోకపోవడం. రెండు– తెలంగాణ స్త్రీల పాత్ర ప్రస్తుత స్త్రీవాద సాహిత్యంలో నామమాత్రం కావడం. మొదటి అంశం విషయంలో ఇప్పటికే కొద్దో గొప్పో చర్చ జరిగింది. రెండో అంశం విషయంలో ఇప్పుడిప్పుడే ఆలోచన మొదలైంది. తెలంగాణ సాంస్కృతిక, సామాజిక మూలాలు కోస్తాకు భిన్నమైనవనే ఆలోచన పదునుదేరిన తర్వాత ఈ ఆలోచన మొదలైంది. ఇందుకు తగినట్లుగానే స్త్రీవాద సాహిత్యంలో తెలంగాణ స్త్రీ పాత్ర చాలా తక్కువ. ఉన్న ఒకరిద్దరు కూడా కోస్తాంధ్ర స్త్రీల వాదనలను, వారి ప్రయోజనాలను కాపాడేవారిగానే మిగిలిపోయారు. నిజానికి, స్త్రీవాద సాహిత్యం తెలుగులో ఇప్పటి వరకు నెరవేర్చిన ప్రయోజనం ఏమిటనే ప్రశ్న వేసుకుంటే ప్రాంతీయ ఆలోచన ఆవిర్భావానికి గల కారణాలేమిటో అర్థమవుతాయి.

కారణాల గురించి ఆలోచించే ముందు ప్రస్తుత స్త్రీవాద ప్రయోజనం ఏమిటి, దీనికి ప్రాతిపదిక ఎక్కడుంది అనే ప్రశ్నలు కూడా వేసుకోవాలి. ఆధునిక వచన సాహిత్యం మొదలైన తర్వాత కోస్తా తెలుగు రచయితలు, నవలాకారులు తెలుగు సమాజంలో స్త్రీ విద్యావంతురాలు కావడం, ఉద్యోగాలు చేయడం గురించి మాట్లాడుతూ వస్తున్నారు. స్త్రీ స్వేచ్ఛ గురించి కూడా మాట్లాడుతూ వస్తున్నారు. చలం, గోపీచంద్ వంటి రచయితలు నేటి స్త్రీవాద రచయితల కన్నా ముందుకు వెళ్లి రచనలు చేశారు. సమాజంలో వస్తున్న మార్పులకు అనుగుణంగా మార్పు చెందడాన్ని కోస్తా వచన సాహిత్య ప్రక్రియ బోధిస్తూ వచ్చింది. స్త్రీకి ఉన్న సంకెళ్లను తెంపేస్తూ వచ్చింది. సమాజంలో స్త్రీ మొబిలిటీ అవసరాన్ని అది నొక్కి చెప్పుతూ వచ్చింది. సామాజిక అవసరాల దృష్ట్యా, కుటుంబ అవసరాల దృష్ట్యా స్త్రీని కుటుంబం నుంచి బయటి ప్రపంచంలోకి తెచ్చే ప్రయత్నం ఆ సాహిత్యంలో జరిగింది. నవల, కథ అనేవి ఆధునిక ప్రక్రియలు కాబట్టి ఆధునిక సమాజం అందించిన అవకాశాలను తెలియజేసేందుకు ఆ అవకాశాలను అందుకోవడానికి స్త్రీ స్వేచ్ఛను తెలియజెప్పేందుకు మంచి సాధనాలయ్యాయి. మధ్యతరగతి చదువుకున్న స్త్రీలకు అవి చేరాయి. స్త్రీ తన కాళ్ల మీద తాను నిలబడాల్సిన అవసరాన్ని ఇవి చెప్పాయి. ఇందుకు ఆటంకంగా ఉన్న జెండర్ ప్రాధాన్యాన్ని ఈ రచనలు తగ్గిస్తూ వచ్చాయి. ఇందులో భాగంగా సెక్స్ స్వేచ్ఛ గురించి మాట్లాడాయి. ఒక స్త్రీ అవివాహితగా సెక్స్‌లో పాల్గొంటే పెద్దగా తప్పు పట్టాల్సిన పని లేదని వ్యాఖ్యానించాయి. వి.రాజారామమోహన్ రాయ్ కథలను ఈ కాంటెక్స్ట్‌లోనే చూడాల్సి ఉంటుంది. మామూలుగా చూస్తే కొంత సెక్స్‌ను కలబోసిన కథలుగా ఇవి కనిపిస్తాయి. కానీ, ఇవి ఇచ్చే సందేశం స్త్రీల నిత్యజీవన మనుగడకు

సంబంధించింది. సమాజంలో ఆర్థికంగా నిలదొక్కుకోవడానికి, పైమెట్లు ఎక్కడానికి సెక్స్ అవసరాలను కట్టుబాట్లకు భిన్నంగా తీర్చుకున్నా ఆమోదయోగ్యమేనని ఆయన తన కథల్లో చెప్తారు. కోస్తాంధ్ర సాహిత్యంలో ఇదొక ట్రెండ్. ఈ దశ దాకా స్త్రీ గురించి పురుషుడు మాట్లాడాడు. ఇదంతా స్త్రీల గురించి రాసినప్పటికీ పురుషుడు పురుషుడికి ఉద్దేశించిన సాహిత్యమే. సమాజంలో స్త్రీ ఎదుగుదలకు ఆటంకం కుటుంబంలోని పురుషులు. కుటుంబంలోని పురుషుడు మానసిక సంకెళ్ల నుంచి బయట పడడానికి ఈ సాహిత్యం పని చేసింది. ఇప్పుడు స్త్రీలు తమ గురించి తామే మాట్లాడుతున్నారు. ఇందుకు అటువంటి సాహిత్యమంతా ఒక భూమికను తయారు చేసింది. ఇప్పుడు స్త్రీలు సెక్స్ స్వేచ్ఛ గురించి ప్రధానంగా మాట్లాడుతున్నారు. సెక్స్ కట్టుబాట్ల నుంచి స్త్రీ బయట పడితే, ఒక రకంగా స్త్రీతత్వం నుంచి బయటపడితే అవకాశాలను అందిపుచ్చుకుని ముందుకు దూకవచ్చు. ఇప్పుడు జరుగుతున్నదదే. వైవాహికేతర సంబంధాలు తప్పు కాని 'విలువ' ఒకటి – ఒక వర్గానికి చెందిన వారిలో స్థిరపడిపోయింది. స్త్రీలు సాహిత్యంలో సెక్స్ స్వేచ్ఛ గురించి మాట్లాడడం తగ్గింది. సమాజంలో వారి స్థానం గురించి వారే మాట్లాడే స్థితి వచ్చేసింది. అంటే, దీన్ని రాయప్రోలు సుబ్బారావు 'అమలిన శృంగారం' సిద్ధాంతం ప్రతిపాదన నుంచి చలం రచనలకు ఆచరణలో పరిణామంగా చూడాలి. స్త్రీ తప్పనిసరిగా బయటి సమాజంలో కాలు పెట్టాల్సి రావడం, దాని వల్ల ఉత్పన్నమయ్యే పరిస్థితులను అధిగమించడానికి మానసికంగా సంసిద్ధులు కావడం కోసం కోస్తా ప్రజలు తమ కోణం నుంచి తాము సృష్టించుకున్న సాహిత్యంగా దీన్ని చూడాల్సి ఉంటుంది. అదే సమయంలో అది ఇతర ప్రాంతాల వారి దృష్టిలో ఒక 'లెజిటమసీ'ని కల్పించుకోవడం కోసం జరిగిన ప్రయత్నం కూడా. (ఇదంతా తప్పని కాదు, ఎదుగుదలలో అసమానతలకు ఇది ఉపయోగపడింది) కోస్తా స్త్రీలు సమాజంలో ఎదిగిన స్థాయికి తెలంగాణ పురుషులు కూడా ఎదగలేదు. అందుకే స్త్రీవాదంపై జ్వాలాముఖి వంటివారు నిప్పులు కక్కారు. ఇది వారి పురుష అహంకారం కాదు; వారి 'వెనుకబాటుతనం'. సమాజంలో ఎదగడానికి, అవకాశాలను అందుకోవడానికి స్త్రీవాదం ఒక సాధనమనే విషయం స్ఫురణకు రాకపోవడం.

తెలంగాణలో ఈ పరిస్థితి లేదు. స్త్రీవాదం గురించి మాట్లాడే స్త్రీరచయితలు ఒకరిద్దరు కూడా కోస్తాంధ్ర స్త్రీవాదుల వరుసలో చివర నిలబడ్డారు. ఇదే సమయంలో తెలంగాణ పురుష రచయితలు కొంతమంది ఇంకా విప్లవోద్యమ సాహిత్యం దగ్గరే ఉండిపోతే మరికొందరు కోస్తా స్త్రీరచయితలతో గొంతు కలిపారు. దీనికి సాంస్కృతిక,



సామాజిక అంతరాలు కారణం. విద్య అనేది కోస్తాలో చాలా ముందుగా అందుబాటులోకి రావడంతో ఎక్కువ మంది పాఠకులు తయారయ్యారు. దీంతో వారి కోసం ఉద్దేశించిన వచన సాహిత్యం నిర్వర్తించాల్సిన పాత్ర దాదాపుగా ముగిసింది. దీంతో వారి కార్యరంగమంతా తెలంగాణకు మారింది.

స్త్రీల కోసం పని చేసే ప్రభుత్వేతర సంస్థలు (ఎన్‌జివోలు) ఇక్కడ ఎక్కువగా తమ దృష్టిని కేంద్రీకరిస్తున్నాయి. వీరు చేసే పనిలో ప్రాంతీయ వివక్ష కొట్టొచ్చినట్లు కనిపిస్తూనే ఉంటుంది. ఇటీవల అస్మిత అనే సంస్థ అచ్చు వేసిన 'మహిళావరణం' అనే బృహద్గ్రంథం ఈ విషయాన్ని తేటతెల్లం చేస్తుంది. ఈ స్థితిలో కోస్తా స్త్రీవాదుల సమస్యలు, తెలంగాణ స్త్రీల సమస్యలు ఒక్కటి కావనే విషయం తెలంగాణ స్త్రీరచయితలు, పురుషరచయితలు, విమర్శకులు గుర్తించాల్సిన అవసరం ఉంది. అంతేకాకుండా, కోస్తా స్త్రీలు స్త్రీకి సెక్స్ స్వేచ్ఛ గురించి, కుటుంబం నుంచి విముక్తి గురించి మాట్లాడుతుంటే తెలంగాణ రచయితలు చాలా మంది విప్లవకథలు రాస్తూ పోయారు. (మొదటి నుంచి తెలంగాణ కథ తెలంగాణలోని సామాజిక సంబంధాల గురించి, ఉద్యమాల గురించి మాత్రమే మాట్లాడుతూ వచ్చింది. సమాజంలో పైమెట్లు అధిరోహించడానికి అవసరమైన మధ్యస్థ సాహిత్య సృష్టి చాలా తక్కువగా జరిగింది) పురుషులు కూడా స్త్రీపురుషుల మధ్య వైవాహికేతర సంబంధాల గురించి కోస్తాతో పోల్చుకుంటే 'వెనుకబాటుతనాన్నే' ప్రదర్శించారు. అల్లం రాజయ్య 'అతడు' కథలో నక్సలైట్ లీడర్‌కి, అతని ద్వారా చైతన్యం పొందిన మహిళకు మధ్య పెరిగిన మానసిక సాన్నిహిత్యాన్ని గురించి మాత్రమే రాశాడు. ఇరువురి మధ్య సెక్స్ సంబంధం ఉందనే విషయాన్ని రాయలేదు. ఆ సంబంధం ఉంటే ఉండవచ్చు, లేకుంటే లేకపోవచ్చు. అది చర్చనీయాంశం కూడా కాని స్థితి ఉందని అర్థం చేసుకోవాలి. అలాగే, తుమ్మేటి రఘోత్తమరెడ్డి 'పనిపిల్ల' కథపై వివాదం చెలరేగడం కూడా ఈ దృష్టితోనే చూడాలి. (పనిపిల్ల కథ స్త్రీవాదానికి వ్యతిరేకమైందనే వివాదం చెలరేగింది). ఈ దృష్ట్యా తెలంగాణ వచన ప్రక్రియల్లోని స్త్రీపురుష సంబంధాలను, స్త్రీపాత్రలను, సామాజిక సంబంధాలను కొత్త కోణం నుంచి అధ్యయనం చేయాల్సి ఉంటుంది.

## 2

ముస్లిం తెలుగు సాహిత్యం ఇవాళ్ల తీవ్రమైన దాడిని ఎదుర్కుంటోంది. అదీ తెలంగాణ నుంచి వచ్చిన ముస్లిం సాహిత్యం మీద మాత్రమే ఈ దాడి జరుగుతోంది. స్కైబాబ రాసిన 'సుల్తానా' అనే కథ మూలంగా దాడి ప్రారంభమైంది. 'సుల్తానా' కథ ఒక ముస్లిం అమ్మాయి హిందువును ప్రేమిస్తే ఏ రకంగా మోసపోతుందో

చెప్పే కథ. ఈ కథ ఒక తెలుగు వారపత్రిక సాహిత్య ప్రత్యేక సంచికలో అచ్చయింది. ఈ సంచిక వెలువడిన చాలా రోజుల తర్వాత ఆ కథ మీద దాడి ప్రారంభమైంది. కథ మీదనే కాకుండా 'జల్‌జలా' అనే తెలుగు ముస్లిం కవితా సంకలనంపై కూడా విమర్శలు వస్తున్నాయి. ఈ కవితాసంకలనం వెలువడి కొన్నేళ్లవుతోంది. చాలా కాలం 'జల్‌జలా' సంకలనంలోని కవితలపై తెలుగు సాహిత్యరంగం మౌనమే పాటించింది. ఈ మౌనం వెనక గల కారణాలేమిటనేది అప్రస్తుతం. ఎందుకంటే కొత్తగా వచ్చిన, వస్తున్న ఆలోచనల పట్ల, విమర్శలపైన తెలుగు సాహిత్యం ఎప్పుడూ మౌనమే పాటించింది; పాటిస్తోంది. ఆంధ్ర సంపాదకుల నేతృత్వంలో వెలువడిన 'జిహాద్'పై గానీ, ఆంధ్ర ముస్లింలు రాస్తున్న రచనలపై గానీ ఈ దాడి జరగడం లేదు. పైగా వాటిన అక్కున చేర్చుకుంటున్నారు. 'సుల్తానా' కథ గానీ, 'జల్‌జలా' సంకలనంలోని కొన్ని కవితలు గానీ హిందువులకు రుచించకపోవడం అసాధారణమేమీ కాదు. పైగా, ఉదార సెక్యులరిస్టులకు అవి మింగుడు పడడం మరీ కష్టం. అయితే, చిక్కల్లా కొందరు తెలుగు ముస్లిం సాహిత్యకారులు కూడా స్కైబాబకు వ్యతిరేకంగా మాట్లాడడంతో వచ్చి పడింది. 'జల్‌జలా' కవులు ఇస్లాం మతంలోని, సమాజంలోని అణచివేత ధోరణులను, పేదరికాన్ని, వివక్షను ప్రశ్నిస్తూ కూడా బలమైన కవితలు రాశారు. ఈ రకంగా చూస్తే మొదట తమ మతపెద్దల ఆగ్రహానికి ఈ కవులు గురికావాల్సి ఉంటుంది. స్కైబాబ ధోరణి వల్ల చాలా మందిని దూరం చేసుకునే పరిస్థితి వస్తుందనేది కొందరి వాదన. ఇందులో నిజం లేకపోలేదు. అయితే, ఎవరినీ నొప్పించకుండా ఐడెంటిటీ ఉద్యమాలు నడిపించడం గానీ, అందుకు సంబంధించిన సాహిత్య సృజన చేయడం గానీ సాధ్యం కాదు. దళితులు అగ్రకులాలపై ధ్వజమెత్తారు. స్త్రీలు పురుషులపై విరుచుకపడ్డారు. ఈ విమర్శలు హద్దులు దాటిన సందర్భాలు కూడా ఉన్నాయి. అలాగే, 'జల్‌జలా' కవులు కూడా హద్దులు దాటారు. ఈ హద్దులు దాటడం అవసరమా, కాదా అనే దగ్గరే పేచీ వస్తుంది. హద్దులు దాటకుండా సున్నితంగా, సుతిమెత్తగా మాట్లాడాలనేది కొందరి వాదన. కవిత్వం ఎవరినీ నొప్పించకూడదనేది వారి వాదనలోని ఆంతర్యం. అది చెప్పడానికి, వినడానికి కూడా బాగానే ఉంటుంది. సుతిమెత్తగా మాట్లాడడమంటే 'హేతుబద్ధంగా' వాదించి ఎదుటివారిని ఒప్పించాలనడమే అవుతుంది. ఆధిపత్యాన్ని అనుభవిస్తున్న ఎవరు కూడా సుతిమెత్తని హేతువును అంగీకరించి తన దారిని మార్చుకోరనే విషయాన్ని కాస్తా ఇంగితం ఉన్న వారెవరైనా చెప్పేయగలరు. కానీ, స్థిరీకృత విలువలను దెబ్బ కొట్టి కొత్త విలువలను ప్రతిపాదించే సందర్భంలో 'అతి' కవిత్వంలో అవసరమే



అవుతుంది. స్త్రీదళితవాదులే కాదు, దిగంబర కవులు కూడా అదే విధంగా వ్యవహరించారు. వారిని కొంత మేరకు వ్యతిరేకించిన సాహితీపెద్దలు కొందరు ఆ తర్వాత వెనక్కి తగ్గారు. అయితే, ముస్లిం తెలుగు కవుల విషయంలో ఆ రాజీకి ఎందుకు వెనుకాడుతున్నారు? దళిత, స్త్రీవాదుల ఐడెంటిటీ వేరు, ముస్లింల ఐడెంటిటీ వేరు కావడమే అందుకు కారణం. అంతేకాదు, స్త్రీ, దళితవాదాలను ముందుకు నడిపిస్తున్నది కోస్తాంధ్ర సాహితీవేత్తలు. ముస్లింవాదానికి తెలంగాణ నాయకత్వం వహించే పరిస్థితులు వచ్చాయి.

తెలంగాణ పల్లెల్లో హిందువులు, ముస్లింలు ఎవరి మతాచారాలను వారు పాటిస్తూనే సహజీవనం చేసే పరిస్థితి ఉండేది/ఉంది. అంటే, ఇక్కడ ముస్లింలు తమ ప్రత్యేక గుర్తింపును కోల్పోలేదు. ఇదే ముస్లింలు, కింది కులాలవాళ్లు కలిసి చేసుకునే పీర్లపండుగల వంటి కొత్త సంప్రదాయాలు పుట్టుకొచ్చాయి. దర్గాలు, పీర్లపండగ వంటివి ఈ సహజీవనాన్ని మరింత పెంచాయి. కోస్తాంధ్రలో ముస్లింలు తమ ఐడెంటిటీని కోల్పోయారు. ఒక మేరకు కోస్తాంధ్రను ఆనుకుని ఉన్న తెలంగాణా జిల్లాల్లోని ముస్లింలు కూడా ఈ ఐడెంటిటీని కోల్పోయారు. ఒక రకంగా, వారు తమ గుర్తింపు లేకుండా హిందూ మెజారిటీ మతానికి తలొగ్గారు. తెలంగాణ పల్లెల్లో ఎవరి ఆచారాలకు వారు (మూఢాచారాలయినా సరే) కట్టుబడి ఉంటూ కూడా పరస్పర విద్వేషం పెంచుకోలేదు. (తెలంగాణ సాయుధపోరాట చరిత్రను అధ్యయనం చేస్తే కూడా ఈ విషయం తెలుస్తుంది) నగరాల్లో, పట్టణాల్లో ఈ విద్వేషాలు చాలా కాలం తర్వాత చోటు చేసుకోవడం ప్రారంభించాయి. స్థానిక ముస్లింలకు, హిందువులకు ఎప్పుడూ వైరం లేదు. బయట నుంచి వచ్చిన ముస్లింల, హిందువుల కారణంగా ఈ విద్వేషాలు మొదలయ్యాయి. వీటి వెనక రాజకీయోద్దేశ్యాలున్నాయి. అప్పటి పరిస్థితి అదయితే, దేశంలో బిజెపి ప్రాబల్యం, రాష్ట్రంలో తెలుగుదేశం ప్రాబల్యం పెరుగుతుండడం వల్ల హిందూముస్లింల మధ్య కృత్రిమ వైరాన్ని మరింత పెంచి పోషించే శక్తులు పెరిగాయి. చదువుకున్న మధ్యతరగతి పట్టణవాసుల మనోభావాలను ప్రభావితం చేసే ఈ శక్తులు ముస్లింలను మరింతగా దూరం చేసే పనులే చేస్తూ వస్తున్నాయి.

కోస్తాంధ్ర ముస్లిం రచయిత నుంచి వెలువడిన ఒక దీర్ఘ కథను చూస్తే అది ఎంత జనరలైజేషన్‌కు గురయిందో అర్థం చేసుకోవచ్చు. 'ఖాదర్ లేడు' అనే కథలో ఖాదర్ పేరు స్థానంలో అప్పారావు, సుబ్బారావులాంటి ఏ పేరు పెట్టినా కథకు వాటిల్లే భంగమేమీ లేదు. ఈ రకంగా కోస్తాంధ్ర ముస్లిం సాహిత్యకారులు

మమ్ముల్ని మీలో కలుపుకోండి అని వేడుకోవడమో, మీతో మాకు వైరుధ్యం లేదని హిందూమతవాదులకు అప్పీల్ చేయడమో చేశారు గానీ తమ ప్రత్యేక ఉనికి గురించి మాట్లాడలేదు. అందుకే, వీరి రచనలతో ఏ పేచీ లేదు. తెలంగాణ ముస్లిం కవులతోనూ, కథారచయితలతోనూ ఈ పేచీ వచ్చి పడింది. ఈ స్థితిలో కోస్తాంధ్ర ముస్లింల మాదిరిగా హిందువులతో బేషరతుగా మమేకమై ఉంటే తెలంగాణ ముస్లింల నుంచి శక్తివంతమైన కవితలు గానీ, కథలు గానీ వచ్చి వుండేవి కావు. పాత్రలకు ముస్లిం పేర్లు తగిలించి కోస్తాంధ్ర రచయితల మాదిరిగా 'విశ్వజనీన సత్యాన్ని', 'దీర్ఘకాలిక రాజకీయ లక్ష్య సాధన అవసరాన్ని' బోధించి వుంటే బ్రాహ్మణవాదులకు, నయాబ్రాహ్మణవాదులకు, నిరింద్రియ మేధావులకు అభ్యంతరం ఉండేది కాదు. తెలంగాణను తమ అంతర్గత వలసగా మార్చుకునే వారి బోధనలు ఎప్పటిలాగానే చెలామణి అయిఉండేవి. మొత్తంగా తెలంగాణ ఐడెంటిటీతో ఈ ప్రాంతం ముస్లింల ఐడెంటిటీ ఆధారపడి ఉంది. నిన్నటి మొన్నటి వరకు వామపక్షాల, విప్లవభావజాలాలను మనస్ఫూర్తిగా అంగీకరించిన మేధావులు, సాహిత్యకారులు చాలా మంది ఈ రోజు వాటిలోని డొల్లతనాన్ని బయటపెట్టే పనికి పూనుకున్నారు. శాశ్వత సత్యం ఉంటుందనే తప్పుడు ప్రచారాన్ని తిప్పికొడుతున్నారు. ఈ కోవలోకే తెలంగాణ ముస్లిం కవులు, రచయితలు వస్తారు. మాట్లాడేది సూటిగా మాట్లాడడమే వీరికి వంటబట్టింది. ఈ అవసరం కూడా ఇక్కడి వారికే ఎందుకు వచ్చిందంటే, తెలంగాణను నానా సిద్ధాంతాలకు ప్రయోగశాలగా మార్చినందుకు.

3

తెలుగులో విప్లవ, స్త్రీవాద కవిత్వాల తర్వాత అంత ఉధృతంగా వచ్చింది దళిత కవిత్వం. చాలా మంది విప్లవ కవులు దళిత కవులుగా రూపాంతరం చెందారు. శివసాగర్ 'నల్లపద్యం' నుంచి సతీష్‌చందర్ 'పంచమవేదం' వరకు దళిత కవిత్వమే అన్నారు. కాదని అనలేం. యువకవిగా విప్లవపాటను ఉర్రూతలూగించిన కలేకూరి ప్రసాద్ దళిత కవిత్వం రాశాడు. మధ్యేవాద కవిత్వం రాసిన ఎండ్లూరి సుధాకర్, శిఖామణి కూడా దళితకవులయ్యారు. సాహిత్యంలో దళిత కవిత్వం పునాదులు సరిగా పడకముందే వీరు కవులుగా నిలదొక్కుకున్నవాళ్లు. మరో ఇద్దరు కూడా బలంగానే దళిత కవులుగా ముందుకు వచ్చారు. వారు– పైడి తెరేష్‌బాబు, మద్దూరు నగేష్‌బాబు. సుంకిరెడ్డి నారాయణరెడ్డి లాంటి అగ్రవర్ణ తెలంగాణ కవులు– 'దళం, దళితం రెండూ కావాల'న్నారు. దళితవాదం వల్ల చాలా మంది కొత్త కవులు వచ్చారు. వీరు ప్రధానంగా తెలంగాణ నుంచి, ప్రత్యేకించి నల్లగొండ జిల్లా నుంచి రావడం గమనించాల్సి ఉంది. కమ్యూనిస్టుల నేతృత్వంలో తెలంగాణ సాయుధ



పోరాటం జరిగిన ప్రాంతం నుంచి, నక్సలైట్ ఉద్యమం బలంగా ఉన్న తెలంగాణ ప్రాంతం నుంచి కొత్త దళితకవులు రావడం ఇక్కడ గమనించాల్సి ఉంది. వీరు చాలా వరకు కమ్యూనిస్టు ఉద్యమాన్ని, నక్సలైట్ ఉద్యమాన్ని మిగతా దళిత కవుల లాగా 'మిత్రవైరుధ్యం'గా తీసుకున్నట్లు లేదు. 'శత్రువైరుధ్యం'గానే స్వీకరించారనిపిస్తుంది. కమ్యూనిస్టులను మాటల్లో కాకుండా (అనధికారికంగా) కవిత్వంలో (అధికారికంగా లేదా బహిరంగంగా) తూర్పారబట్టారు. (ఇందుకు వారు చెల్లించిన మూల్యం ఇక్కడ చర్చనీయాంశం కాదు) లక్ష్మీనరసయ్య, త్రిపురనేని శ్రీనివాస్‌లు దళిత కవిత్వానికి అండదండలందించిన మాట వాస్తవమే. అయితే త్రిపురనేని శ్రీనివాస్‌ను పక్కనపెడితే లక్ష్మీనరసయ్య స్త్రీ, విప్లవాదకవులకు, దళితకవులకు మధ్య ఎక్కడో ఒక దగ్గర సంధి కుదిర్చే ప్రయత్నం చేశారు. సంధి కుదిర్చే ప్రయత్నానికి నల్లగొండ గోసంగి కవులు పెద్ద అడ్డంకిగా నిలిచారు. ఇక్కడే కవిత్వానికి ప్రాంతం ఉంటుందని భావించడానికి వీలుంది. ఈ లెక్కన తెలంగాణ నుంచి వెలువడిన దళిత కవిత్వం, కోస్తా నుంచి వెలువడిన దళిత కవిత్వం ఒక్కటి కాదు. బహుశా, ఆకాంక్షలు కూడా ఒక్కటి కావు. ఈ తేడా ఎందులో ఉంది? సంస్కృతిలో ఉంది. అంటే, అన్ని సామాజిక అడ్డంకులను దాటి వచ్చినవారు కోస్తా దళిత కవులు. ఇంకా దాటడానికి ప్రయత్నిస్తున్నవారు తెలంగాణ దళిత కవులు. దళిత కవిత్వం రాస్తున్న కోస్తా దళిత కవులు తాతల తరం నుంచీ, కనీసం తండ్రుల తరం నుంచి విద్యనార్జించిన కుటుంబాల్లోంచి వచ్చినవారు. తెలంగాణలో ప్రస్తుతం కవిత్వం రాస్తున్న దళిత కవులు చాలా మంది తొలితరం విద్యావంతులు మాత్రమే. అందువల్ల సంస్కృతిలో తేడా ఈ రెండు ప్రాంతాల కవుల మధ్య కొట్టొచ్చినట్లు కనిపిస్తుంది. వేముల ఎల్లయ్య కక్క నవల అర్థం కావడం లేదని అన్నవారు చాలా మందే ఉన్నారు. అర్థం కాలేదని అంటే ఫర్వాలేదు. ఎల్లయ్య తన భాషను మార్చుకోవాలని సూచించారు. ఆయన రాతను తప్పు పట్టే ప్రయత్నాలు చేస్తున్నారు. అలాగే, అంబటి వెంకన్న రాసిన కథను ఎవరూ పట్టించుకోలేదు. కేవలం తెలంగాణ యాసలో వెలువడడం వల్ల ఇలా జరుగుతోందని చెప్పలేం. వారు తమ దళిత ఉనికితోపాటు తెలంగాణ ఐడెంటిటీని సాహిత్యంలోకి తెస్తున్నారు. ఇది మింగుడు పడని వ్యవహారం. వారు రాయాల్సిన పద్ధతి గురించి పాఠాలు చెప్పుతున్నారంటే మీరింకా ఎదగలేదని వారికి చెప్పడమే అవుతుంది. తెలంగాణ పెద్దలు తమకున్న సిద్ధాంతరాద్ధాంతాల వల్ల ఎల్లయ్య కవిత్వాన్ని కాదంటుంటే, కోస్తాంధ్ర సాహిత్యకారులు భాష పేరు చెప్పి, యాస పేరు చెప్పి తృణీకరించే పనికి పూనుకున్నారు. అల్లం రాజయ్యకు మొదట్లో ఇదే పరిస్థితి ఎదురయిందనేది మనం ఇక్కడ గుర్తిస్తే మొదటి నుంచి జరుగుతున్న ప్రయత్నమేమిటో మనకు ఇట్లే అర్థమైపోతుంది.

4

మొత్తంగా, సాహిత్యం స్థలనిర్దేశితం. ప్రాంతాలన్నీ ఒక్కటి కానట్లే సాహిత్యమంతా ఒక్కటి కాదు. అంటే, ఒకే భాషలో వెలువడిన సాహిత్యమంతా ఒకటి కాదు. ఇంకా చెప్పాలంటే, ఒకే కాలంలో వెలువడిన తెలుగు సాహిత్యమంతా ఒక్కటి కాదు. ఇంకా నిర్దిష్టంగా చెప్పాలంటే, విశ్వాసాల దృష్ట్యా, సైద్ధాంతిక నిబద్ధతల దృష్ట్యా వెలువడిన ఒకే రకమైన సాహిత్యమంతా ఒక్కటి కాదు.

కేవలం భాష పేరు మీద ఐక్యమైన ఇరు ప్రాంతాలకు ఒకే కొలబద్దలు పనికి రావు. కోస్తా, తెలంగాణల మధ్య సాంస్కృతిక, సామాజిక, చారిత్రక వైరుధ్యాలున్నాయి. ఆధునికతను అన్ని రకాలుగా సంతరించుకున్న కోస్తా సాహిత్యకారులకు కెరీరిజంలో పైమెట్టు అధిరోహించడానికి సాహిత్యం పనికి వస్తుంటే తెలంగాణ సాహిత్యకారులకు తమను తాము వ్యక్తీకరించుకునే సాధనం మాత్రమే. విప్లవ సాహిత్యం ఎక్కడ కెరీరిజానికి అడ్డంకిగా మారిందో అక్కడ కోస్తా సాహిత్యకారులు ప్రశ్నలు సంధించారు. (వాటిని సహేతుకమైన ప్రశ్నలు కావని అనలేం. అది వేరే విషయం) కోస్తాంధ్రులకు జీవితంలో పైమెట్టు అధిరోహించడానికి దళిత, స్త్రీవాదాలు సాధనాలుగా మారాయి. ఇవ్వాళ్ల సాహిత్యాన్ని వారు వాడుకుంటున్న తీరును, అంటే వారి ఆచరణను చూస్తే ఈ విషయం అర్థమైపోతుంది. దీన్ని పక్కన పెడితే, రెండు ప్రాంతాల సాహిత్యాలను ఒకే కొలబద్దతో కొలవడం సమంజసం కాదని గుర్తించాల్సిన అవసరం ఉంది. అంతేకాదు, దళిత, స్త్రీవాదులు స్థానిక ఉనికిని చాటే రచనలు చేయడం అవసరం. ప్రత్యేక తెలంగాణ వాదాన్ని అంగీకరించి అందుకు అనుగుణమైన రచనలు చేయడమే తెలంగాణ రచనలు చేయడం కాదు. తమ సాంస్కృతిక మూలాలను వ్యక్తీకరించే రచనలు చేయడం కూడా తెలంగాణ రచనలు చేయడమే. ఈ విషయాన్ని తెలంగాణ రచయితలు గుర్తించడం అవసరం. వీరిపై కన్నా తెలంగాణ మేధావుల మీద, విమర్శకుల మీద బృహత్తర బాధ్యత ఉంది. ప్రచారంలోకి వస్తున్న ప్రతి దోరణిని భుజాన మోయకుండా తెలంగాణ కోణం నుంచి ఆలోచించి స్పందించాల్సి ఉంటుందనేది వీరు గుర్తించాలి.

**('తెలంగాణ తోవలు' సెప్టెంబర్ 2001)**



# సైద్ధాంతిక వాస్తవికత- సామాజిక వాస్తవికత

ప్రపంచ సాహిత్యంలో ఎక్కడైనా ఉందో, లేదో గానీ తెలుగు సాహిత్యంలో మాత్రం ఒక జాడ్యం ఉంది. (సంస్కృత సాహిత్యంలో జరిగిన చర్చను బట్టి ఆ సాహిత్యంలో వుందనుకోవాలి) ప్రాచీన సాహిత్యంలో 'ప్రయోజనానికి', ఆధునిక సాహిత్యంలో 'నిబద్ధత'కు (నిమగ్నతకు కాదు) ఎక్కడ లేని ప్రాధాన్యం ఇవ్వడమే ఆ జాడ్యం. దీన్ని జాడ్యమని ఎందుకనుకోవాలంటే, సృజనాత్మకతను రెండవ స్థానంలోకి నెట్టేస్తుంది కాబట్టి. నిజానికి, సాహిత్యానికి ఏదో రకమైన ప్రయోజనం ఉండి తీరుతుందనడంలో భేదాభిప్రాయాలు ఉండనక్కర్లేదు. శ్రీశ్రీ చెప్పిన ప్రయోజనరహితమైన pure poetry ఉండదు. దేన్నయితే శ్రీశ్రీ pure poetry గా పిల్చాడో, దానికి కూడా ప్రయోజనం ఉండి తీరుతుంది. సాహిత్యానికి ప్రయోజనం ఉండి తీరుతుంది. సాహిత్యానికి ప్రయోజనం ఉన్నప్పుడు దాన్ని సృష్టించిన సాహితీవేత్తకు 'నిబద్ధత' ఉండి తీరుతుందని, రచయిత దేనికి నిబద్ధుడై ఉన్నాడనే విషయంపై అతను సృజించిన సాహిత్యం నెరవేర్చే ప్రయోజనం ఆధారపడి ఉంటుందని చెబుతూ వచ్చారు. అది నిజమే కావచ్చునని మూస రచనలు చేస్తూ వచ్చారు. అయితే, సృజనాత్మక రచనకు కాల్పనికత (భావకవిత్వం గురించి చెప్పేటప్పుడు పరిమితార్థంలో వాడే కాల్పనికత కాదు), శైలి ప్రాణాలు. పాఠకులు సృజనాత్మక రచనలను మేధోసంపత్తిని పెంచుకోవడానికి చదవరు. కాబట్టి, సృజనాత్మక ప్రక్రియలో 'రీడెబిలిటీ' ముఖ్యం. ఈ రీడెబిలిటీని సాధించి పెట్టేవే కాల్పనికత, శైలి. రీడెబిలిటీ లోపించిందంటే ఆ రచన సృజనాత్మక రచన కాదనుకోవాలి. సృజనాత్మక రచన హృదంతరాళాల్లో తుఫానులు సృష్టించాలి. కానీ, అది జరుగుతోందా? చాలా రచనల విషయంలో, ముఖ్యంగా ఉద్యమాలకు నిబద్ధులై రాసేవారి రచనల్లో ఆ లక్షణం కొరవడుతోంది. అందుకే, రచనలు చేయడానికే కాదు, చదవడానికి కూడా 'నిబద్ధత' ఉండాలని కొంతమంది సృజనాత్మక ఉద్యమ రచనల పట్ల నిరసన వ్యక్తం చేయడం. తమ రచనల్లో కొరవడుతున్న లక్షణాన్ని గుర్తించకుండా, గుర్తించ నిరాకరించి 'రాజకీయ సాహిత్య ఉద్యమకారులు' పాఠకులను నిందిస్తున్నారు. ఒక రకంగా వారిని కించపరుస్తున్నారు.

సృజనాత్మక సాహిత్యంలో ఈ అవలక్షణానికి కారణలేమిటి? దీనికి సమాధానం కోసం ఎవరూ ప్రయత్నించినట్లు లేదు. ప్రయత్నిస్తే జవాబు దొరకడం సులభమే. సిద్ధాంతాలకు కట్టుబడి ప్రయోజనాత్మక రచనలు చేస్తున్నామనే వారి నుంచే అన్ని రకాల సమస్యలు వస్తున్నాయి. మిగతావారి విషయంలో ఈ సమస్యలు లేవు. సిద్ధాంతం వెలుగులో రచనలు చేస్తున్నామని చెప్పి, తమ రచనలు చదవాలని డిమాండ్ చేసే సృజనాత్మక రచయితలు, తాము నిజంగానే సృజనాత్మక రచనలు చేస్తున్నామా అనే ప్రశ్న వేసుకోవడం అవసరం. 'సామాజిక వాస్తవికత'ను ప్రతిబింబించడానికి రచనలు చేస్తున్నామని వీరు సృజనాత్మక రచనా లక్షణాలకు తిలోదకాలు ఇవ్వడం లేదా? సిద్ధాంతాలకు కట్టుబడి ఆచరణలో ఉన్నవారిని అది బాధపెట్టకవపోవచ్చు. కానీ, 'రాజకీయ సాహిత్య ఉద్యమకారులు' చైతన్యపరిచి, తమ సిద్ధాంతాల వైపు, ఆచరణ వైపు మళ్లించుకోవడానికి రచనలు చేస్తారు. అంటే, జనసామాన్యం కోసం రచనలు చేస్తారు. మరో రకంగా చెప్పాలంటే, తమ సిద్ధాంతాల గురించి తెలియనివారి కోసం రచనలు చేస్తారు (ఇదే జరగడం లేదు). అటువంటప్పుడు తప్పకుండా రచయితలు రీడెబిలిటీని సాధించాలి. అలా సాధించకుండా తమ రచనలు చదవాలని కట్టడి చేసే హక్కు రచయితలకు లేదు.

ఆధునిక సాహిత్యాన్ని ఒకసారి పర్యావలోకిస్తే, సిద్ధాంతాలకు కట్టుబడుతూ, జీవితానికి కట్టుబడని రచనలే ఎక్కువగా వస్తున్నాయి; ఒక రకంగా ఉద్యమంగా వస్తున్నాయి. అంటే, సృజనాత్మక రచనల పేర చాలా వరకు 'సామాజిక వాస్తవికత'ను ప్రతిబింబించే నెపంతో 'సైద్ధాంతిక వాస్తవిక' రచనలు చేస్తున్నారు. అంటే, తాము నమ్మిన సిద్ధాంతాలను నిరూపించడానికి ( ఆ సిద్ధాంతం కరెక్ట్ అని చెప్పడానికి) వస్తున్న రచనలే ఎక్కువ. మరో రకంగా చెప్పాలంటే, సైద్ధాంతిక వాస్తవిక రచనలు సృజనాత్మక రచనల బోర్డు తగిలించుకుని మన ముందుకు వస్తున్నాయి. అందువల్ల, అవి జీవితాలను, జీవిత వాస్తవికతను, అంతిమంగా సామాజిక వాస్తవికతను ప్రతిబింబించడం లేదు. అంటే, సైద్ధాంతిక వాస్తవిక రచనలే ఎక్కువగా వస్తున్నాయి గానీ, సామాజిక వాస్తవిక రచనలు రావడం లేదు. అందుకే, వచన ప్రక్రియలో ఫ్లాట్ క్యారెక్టర్స్ తప్ప రౌండ్ క్యారెక్టర్స్ ఉండడం లేదు. పాత్రల పరిణామక్రమ చిత్రీకరణ లేదు.

ఇది విప్లవ సాహిత్యానికే కాకుండా దళిత, స్త్రీవాద సాహిత్యాలకు కూడా వర్తిస్తుంది. అందుకే, అప్పుడప్పుడు సాహిత్యంలో 'స్తబ్దత' అనేది చర్చనీయాంశంగా మారుతోంది. విప్లవ సాహిత్యంలో లేదా దళిత సాహిత్యంలో లేదా స్త్రీవాద సాహిత్యంలో



స్తబ్దత చోటుచేసుకుంటోందే గానీ సాహిత్యంలో స్తబ్దత చోటు చేసుకోవడం లేదు. దీనికి కూడా సైద్ధాంతిక వాస్తవిక రచనలే కారణం. సిద్ధాంతం గురించి అంతకన్నా ఎక్కువ చెప్పలేని ఒక 'నిస్సహాయ దశ' వచ్చినప్పుడు సాహిత్యంలో స్తబ్దత చోటు చేసుకుంటున్నట్లు అనిపిస్తుంది. అసలు సిసలు సృజనాత్మక రచయితలకు, కవులకు ఈ సమస్య లేదు. ఎందుకంటే, రచయితలకున్న పరిమితులు జీవితానికి లేవు. ఆ జీవితాన్ని దర్శించే రచయితల కంటిచూపు కొంత దూరమే చొచ్చుకుపోగలుగుతుంది.

మొత్తంగా, తెలుగు సృజనాత్మక రచయితలు ఎక్కువ మంది (అంటే నిబద్ధత గురించి మాట్లాడేవారు) ఒక ప్రధానమైన అంశాన్ని విస్మరిస్తున్నారు. సిద్ధాంతం జీవితాన్ని అంటే సమాజాన్ని అర్థం చేసుకుని, విశ్లేషించే పనిముట్టుగా వాడుకోవాలనే విషయాన్ని వారు గమనించడం లేదు. సమాజాన్ని ఒక దశలో విశ్లేషించిన సిద్ధాంతమే సత్యమని నిరూపించడానికి వారు రచనలు చేస్తున్నారు తప్ప జీవితం చీకటి కోణాల గుట్టు విప్పే పని చేయడం లేదు. ఈ గుట్టు విప్పే సందర్భంలోనే సిద్ధాంతం క్రియాశీలక పాత్ర పోషిస్తుంది. దాన్నే 'దృక్కోణం' అనవచ్చునేమో! ఈ దృక్కోణమే సామాన్యుడి నుంచి రచయితలను వేరు చేస్తుంది. అందుకే, ఒక సంఘటన విషయంలో సామాన్యుడు స్పందించే తీరు ఒక రకంగానూ, కవులు రచయితలు స్పందించే తీరు మరో రకంగానూ ఉంటుంది. ఆ సంఘటనను ఉన్నదున్నట్లు చిత్రించడం 'సామాజిక వాస్తవికత'ను ప్రతిబింబించడం కాదు. దీన్ని అంగీకరించి కూడా తమ రచనలు 'సంఘటనలు చిత్రించే కంకాళాల' మాదిరిగా ఉంటున్నాయనే విషయాన్ని అంగీకరించరు.

తెలుగు సృజనాత్మక సాహిత్యం సైద్ధాంతిక దారిలో నడుస్తోంది. కాబట్టే త్రిపుర కథలను, పతంజలి, కేశవరెడ్డి నవలలను, రాయలసీమ రచయితల నవలలను, కథలను విశ్లేషించే విమర్శకులు కరువయ్యారు. వాటికి దుర్వ్యాఖ్యలు చేసేవారు ఎక్కువ మంది తయారయ్యారు. ఈ స్థితిలోనే, కేశవరెడ్డి రాసిన నవలల మీద కొంత మంది ఆ మధ్య దుమ్మెత్తిపోశారు. అంటే 'సామాజిక వాస్తవికత' అంటే ఎదురుగా కనిపించేది మాత్రమే అనే గుడ్డి నమ్మకం. ఈ గుడ్డి నమ్మకం సాహిత్యంలో పేరుకుపోవడమే కాదు కర్రపెత్తనం చేస్తోంది. ఈ పరిస్థితి వల్లనే కేశవరెడ్డి నవలలు సామాజిక వాస్తవికతను ఎంత సమర్థంగా ప్రతిబింబిస్తున్నాయో, అవి సృజనాత్మక రచనలు నెరవేర్చాల్సిన ప్రయోజనాన్ని ఎంత బలంగా నెరవేరుస్తున్నాయో తెలుసుకోలేకపోతున్నాం. అందువల్లనే, కేశవరెడ్డి నవలలపై వచ్చిన విమర్శలకు

జవాబు చెప్పేవారు లేకుండాపోయారు. సృజనాత్మక సాహిత్యం, విమర్శ రెండూ పరస్పర ప్రభావితాలు అనుకుంటే, విమర్శకులు లేరని బాధపడేవారు అసలు సిసలు సృజనాత్మక రచయితలు వేళ్ల మీద లెక్కించగలిగినంత మంది మాత్రమే ఉన్నారని గమనించడం అవసరం.

విప్లవ, దళిత, స్త్రీవాద రచయితలు తాము చేస్తున్న తప్పేమిటో గుర్తించి తాము విశ్వసిస్తున్న సిద్ధాంతాలను కేవలం పనిముట్లుగా మాత్రమే వాడుకున్నప్పుడు, సైద్ధాంతిక సృజనాత్మక రచనలకు కాలం చెల్లితే (ఇది అత్యాశే అవుతుంది) సృజనాత్మక రచనలు వెల్లివిరుస్తాయి.

**(23 అక్టోబర్ 1999 సుప్రభాతం వీక్లీ ప్రత్యేక సంచిక)**



# మళ్ళీ ప్రారంభించడానికి......

"మా నాలికతో మేమే గతుక్కుంటాం బతుకుని" అని వేముల ఎల్లయ్య "కామ్రేడ్‌కు కడసారి" వీడ్కోలు చెబుతూ ప్రతిజ్ఞ చేసుకున్నాడు. అదేదో మామూలు కామ్రేడ్స్‌కి కాదు అగ్రవర్ణ కామ్రేడ్‌కు. పుట్టుకతోనే కులాన్ని వెంట తెచ్చుకున్న మనం కులాన్ని భుజం మీది కండువా తీసి పారేసినంత 'ఈజీ'గా పారేయ్యలేం. మనం సరే, అది వదులుతుందా? రక్తంలోని అణువణువులో జీర్ణించుకుపోయిన కులం, మనల్ని అంత సులువుగా వదిలిపెట్టదు. కొడవటిగంటి కుటుంబరావు 'పార్వతీ పరిణయం' కథలో– అగ్రవర్ణ యువతిని ఆశపడి పెళ్ళి చేసుకుంటాడో దళితుడు. అతడు ఆశపడ్డాడు, అగ్రులు చాచాడు. కానీ ఆమె వల వేసింది. ఆ వలలో పడ్డాడు మనవాడు. అంతే, వాడి జీవితం వాడిది కాకుండా పోయింది. అగ్రవర్ణ బ్రాహ్మణ సంస్కృతి చుట్టుముట్టి అతను అస్తిత్వం కోల్పోయాడు. ఇదీ అంతే. ఉద్ధరించడానికి వచ్చే అగ్రవర్ణ కామ్రేడ్స్‌ను నమ్మకూడదు గాక నమ్మకూడదని "మేమే" కవులు అనుభవంతో తెలుసుకున్నారు.

గోసంగి ప్రచురణలుగా 'మేమే' అనే దళిత బహుజన కవిత్వాన్ని వెలువరించారు కొంతమంది యువకులు. వీళ్లలో చాలామంది మనకు 'చిక్కనవుతున్న పాట', 'పదునెక్కినపాట'లలో కనిపిస్తారు. ఆ తర్వాత కొంతమంది కవులుగా పుట్టారు. దళిత జీవితాన్ని వెంటేసుకొని దళితభాషను మూటగట్టుకొని 'కవిత్వ వరద'ను సృష్టిస్తున్నారు. పైడి తెరేష్‌బాబు లాంటి వాళ్లు పెద్దవాళ్లయ్యాక సిద్ధాంతానికి, కవిత్వానికి పొత్తు కుదిర్చే ప్రయత్నంలో ఉండగా వేముల ఎల్లయ్య, ఇంకా కొంత మంది 'జీవిత భాష' పలుకుతున్నారు.

సుంకిరెడ్డి నారాయణ రెడ్డి 'బహువచనం' పేరుతో నీలిగిరి సాహితీ ప్రచురణగా ఒక కవితా సంకలనం తెచ్చాడు. నీలిగిరి సాహితిని నల్లగొండలో పెంచి పోషించింది ఆయనే. ఈ 'బహువచనం' కూడా దళిత కవిత్వమే. 'మేమే' కవులు ఆయనకు ఓ నమస్కారం పెట్టేసి నీలిగిరి సాహితి నుంచి బయటకు వచ్చారు. ఈ 'మేమే' కవులను తయారు చేయడంలో బహుశ 'నేను రక్తం ధారపోశాను' అని నారాయణరెడ్డి గారు బాధపడుతూ 'వారందరూ నన్నే శపిస్తున్నారు' అని, ఇదేం న్యాయమని వాపోవచ్చు. ఈ 'మేమే' కవులు విడిపోయినందుకు నారాయణరెడ్డేం బాధపడక్కర్లేదని నా మతం. నిజానికి గర్వించాలి. వాళ్లు నిన్ను కూడా ప్రశ్నిస్తున్నందుకు కాలరెత్తుకోవాలి. ప్రశ్నే కదా ఆయుధం. ప్రశ్నించేవాడే కదా కవి. మేమే కవులు

'బహువచనం' సంకలనంలో కనిపించిన తరువాత 'మేమే' అంటూ గొంతెత్తారు. దళితులుగా పుట్టి పెరుగుతున్నందుకు ఎదుర్కొంటున్న అసమానతలను వారు పలికారు. అట్లా వుంచిన వారిని ప్రశ్నించారు. నిలదీశారు. ఇందులో భాగంగానే వేముల ఎల్లయ్య కూడా కామ్రేడ్స్‌తో కడసారి ఒక మాట చెప్పాడు. ఈ మాట చెప్పినందుకు ఎవరెవరో ఎందుకు భుజాలు తడుముకోవాలి?

మేమే కవులు మట్టివాసనను, పుట్టి పెరిగిన వాతావరణాన్ని వదిలి పెట్టలేదు. అందుకే వాళ్లు ఆత్మీయులవుతున్నారు. ఆత్మకథలు వినిపిస్తున్నారు. ఇప్పుడు కావాల్సింది ఆత్మకథలే. ఇతరుల కథలను ఇంపుగా, కనసొంపుగా వినిపించడం ఇక చెల్లదు తెలుగు సాహిత్యంలో. కవులేం ఉద్యమాలు చేయక్కర్లేదు. జీవిస్తే చాలు. ఆ జీవించడం మానేసి ఉద్యమాల దుడ్డు కర్రలు చేతబట్టుకొని కొందరు సాహిత్యాన్ని దుడ్డుకర్రలతో శాసించడం మొదలు పెట్టారు. కాబట్టే చాలా కవిత్వం కవిత్వం కాకుండా పోయింది.

ఇప్పుడు
ఈ మట్టి గుండ్రంగా నవ్వుతుంటే
కనిపించేదంతా
మేమే మావాళ్లం" (ఎం. వెంకట్) అని ప్రకటించుకుంటే ఉలికిపాటు ఎందుకు? మన సాహిత్యం కర్మాగారమైంది. చాలా మంది కవులను, రచయితలను తయారు చేస్తామంటూ బయలుదేరారు. ఇలా బయలుదేరడమే మనకు చేసిన నష్టం. రక్తంలో లేకుండా ఎవరు ఎవర్నీ ఏ రూపంలోనూ చెక్కలేరు. వాస్తవానికి జీవితాన్ని జీవితంగా జీవిస్తున్నవారు, జీవించడమంటే 'ఉగ్రతపశ్చర్య' అని భావించినవాళ్లు సహజంగానే కవులు. మాట నేర్వడం, అడుగు వేయడం ఇతరులను చూసి నేర్చుకోవచ్చు. కానీ రక్తంలో ఉండాలి కదా.. రక్తంలో ఉంది కాబట్టే వీళ్లు కవులయ్యారు.

'వర్ణ వర్ణాలుగా వూళ్లు
కలవని కన్నీళ్లుగా వూళ్లు
కలలు కరిచారిన వూళ్లు
మతమాడిన జూదంలో,
హతులు- గోసంగులు
హంతకుడు- భగవంతుడు" (ఎ. దుర్గాప్రసాద్) ఇదేమిటిఓ గానీ మనందర్నీ అవసరం వచ్చినప్పుడల్లా హిందువులను చేస్తున్నారు. ఇంతకాలం మనం నిజమేనని అనుకున్నాం. మనకూ, హిందు మతానికి ఏ విధమైన సంబంధం లేదని కంచ ఐలయ్య చెబుతున్నాడు. దాన్ని మనం అత్యధికులం హిందువులం కాదని ఒప్పేసుకుందాం. అప్పుడు మన దళితబహుజనులందరం ఎక్కువ మందిమే అవుతాం.



భగవంతుడునేవాడ్ని మనమే వెలేస్తే మనకు పరిష్కారం లభిస్తుందేమో చూద్దాం!

మేమే కవులు జీవిత మూలాల్లోకి వెళ్లారు. తెలుగు సాహిత్యంలో ఇంత వరకు ఈ విధమైన పద్ధతి దాదాపుగా లేదు. ఎందుకంటే, ఉద్బోధల కోసం, ప్రయోజనాల కోసం, సంఘటితం చేయడం కోసం- లేదంటే అత్యధికులకు మత్తు ఇవ్వడం కోసం మన సాహిత్య సృజన జరిగింది. లేదంటే పట్నవాసపు పరాయికరణల కవిత్వం కుప్పలు తెప్పలు వచ్చింది. మన భాషలో మనం కవిత్వం రాసింది అరుదే కదా! మేమే కవుల్లో ఒకరైన కొంపెల్లి వెంకట్ ఇలా అంటున్నాడు. విందామా-

"మోకు పట్టకుండా
మూడు మానకల పటవ దింపి
పందెంలో గెల్చి
నాతో ఎన్ని రేకులు తాగించావురా
చింతల్తాడు కల్లు తాగి
కాటమయ్య పండగ నాడు
దప్పుల పండగ నాడు
దప్పుల దరువుల్లో అడుగులేస్తున్నప్పుడు
చీకటి పారిపోవడం గుర్తుందారా, చిన్నా"- ఇదేమైనా అర్థమైందా, కాలేదంటే నీకు జీవితం అర్థం కాలేదని అర్థం. "మూడు మానకల పటవ, ఎన్ని రేకులు తాగించావురా, కాటమయ్య పండుగ- ఇవన్నీ మన జీవితంలో భాగాలే అయినప్పుడు- మన జీవితం గురించే కవిత్వం రాస్తున్నామని అంటున్నప్పుడు అవి అర్థం కాలేదంటే- నువ్వు జీవితానికి దూరమైపోయావని అర్థం. జీవితానికి దూరమై పోయాక నీకు అర్థమయ్యేది, అవగతమయ్యేది, నువ్వు పట్టుకు వేళ్లాడేది తెలుగులో వస్తున్న అన్యభాష కవిత్వాన్నే. గుంపులో నువ్వూ ఒకటైపోతావు. అప్పుడు సాహిత్యం పేజీలను కౌగలించుకుంటూ బతకాల్సిందే. నీకు జీవితం లేదు కాబట్టి నువ్వు చచ్చిపోయినట్లే లెక్క.

నువ్వు కవివి కాదల్చుకుంటే-

కాలిలో పాతిపెట్టిన గుండెలు/ అవమానంతో భూమిని చీల్చుకుపోయిన/ ఆకాశపు ఎత్తు" చూడాలి. నిద్రలేవండి మహాకవులారా! బుకాయించడం మానేయండి! మేమే కవులను చూసి మళ్లీ మొదటికి రండి!

**చాటింపు, 1-15 జనవరి 1997**

# స్త్రీ స్వేచ్ఛపై 'కాల్పనిక' కుట్ర

ఈ రోజు తెలుగు సాహిత్యంలో స్త్రీ స్వేచ్ఛ ప్రధాన వస్తువయింది. స్త్రీ తన కోసం తాను కలం పట్టింది. గళం విప్పింది. ఇది చాలా మంది పురుష సాహిత్య పీఠాధిపతులకు, సిద్ధాంత నిబద్ధతను వక్కాణించే నాయకులకు మింగుడు పడని వ్యవహారంగా మారింది. బలహీనుల తరపున వకాల్తా పుచ్చుకున్న అభ్యుదయ పురుషుడు ఈ కొత్త నేపథ్యంలోలో చివరి పుటల్లోకి వెళ్లిపోవాల్సిన వాతావరణం ఏర్పడింది. అందుకే స్త్రీవాద సాహిత్యంపై అనేకానేక ఎదురుదాడులు ప్రారంభమయ్యాయి. ఈ దాడులకు వర్గ స్వభావం ఒక పనిముట్టుగా వీరి చేతుల్లో ఉంది. స్త్రీవాద సాహిత్యానికి వ్యతిరేకంగా వచ్చిన వాదనలకు దూషణలకు స్త్రీ సాహితీవేత్తలే సమాధాలిస్తూ వస్తున్నారు. విమర్శ, ప్రతి విమర్శలతో ఎదుర్కోలేమని గ్రహించిన వారు కవిత, కథా సాహిత్యాల ద్వారా స్త్రీవాదం అభివృద్ధి నిరోధకం, విప్లవోద్యమాలకు శత్రువు అనే వాదాన్ని ముందుకు తెస్తున్నారు. ఇందులో భాగంగానే తుమ్మేటి రఘోత్తమ రెడ్డి 'పనిపిల్ల' కథ వచ్చింది. "కన్స్యూమరిజం నిలువునా మింగేసిన భార్య వల్ల తీవ్ర మానసిక, శారీరక వ్యధలకు లోనైన" ఒక భర్త కథ 'పనిపిల్ల'. 'కన్స్యూమర్ గూడ్స్'పై మక్కువ కలిగిన భార్యతో నిత్యం పడే ఘర్షణ స్వభావం ఏమిటనే సంఘర్షణకు లోనై ఒక నిర్ధారణకు వచ్చి 'సత్యం' నిరూపితమైనట్లు ఊపిరి పీల్చుకుంటాడు ఈ కథలోని నాయకుడు మహేంద్ర. తాను 'వర్గ శత్రువు'తో కాపురం చేస్తున్నాననే సత్యాన్ని తను కనుక్కుంటాడు. "తాను తన భార్య నిరంతరం చేసే యుద్ధం- పరస్పర విరుద్ధ జీవన విధానాల సారాంశం. స్వభావాల మధ్య జరిగే సంఘర్షణలు. ఎవరి రెక్కల కష్టం వారికే చెందాలనేది ఒక జీవన విధానానికి సంబంధించిన స్వభావం- ఒకరి రెక్కల కష్టాన్ని పీడించి దోచుకు తినాలనేది రెండోది- ఈ రెంటి మధ్య రాజీ లేని యుద్ధాలే ఇవి.

వీటికి స్త్రీపురుష విచక్షణ లేదు. వీటికి కులం, మతం, జాతి ప్రసక్తి లేదు. ఒకడి రెక్కల కష్టాన్ని దోచుకోవాలి. ఆ దోపిడీని ప్రతిఘటించాలి. ఇది అంతులేని అనంత కాలాల యుద్ధం. మహేంద్రకు తనెటు నిలిచాడో? తన భార్య ఎటు నిలిచిందో స్పష్టంగా బోధపడ్డది. ఈ నిర్ధారణకు మహేంద్ర ఒళ్లు గగుర్పొడిచింది. ఒక దేశం ప్రాంతం గ్రామం, తెగ కాదు- ఒకే ఇంట్లో ఒకే పడకపై శత్రువుతో చేసే సంసారం" అనేది తేల్చడానికి రచయిత పనిపిల్ల కథ రాశాడు.

మహేంద్రది ఎవరి రెక్కల కష్టం వారికే చెందాలనే జీవన విధానానికి



సంబంధించిన స్వభావం. ఈ స్వభావమే అతన్ని ప్రగతిశీలుడిగా కథలో నిలబెట్టింది. అతనికి పోరాటాలతో ప్రత్యక్ష సంబంధం లేదు. అతను ప్రగతిశీల పోరాటాల సానుభూతిపరుడని భావించాల్సి ఉంటుంది. అంటే బహుశా మేధావి; ప్రగతిశీల భావజాలానికి అతను ప్రతినిధి. అతనికి స్త్రీల పట్ల చిన్నచూపు లేదు. స్త్రీల పట్ల మహేంద్రకు వివక్ష లేదని చెప్పడానికి కూడా రచయిత కథలో అవకాశం దొరికినప్పుడల్లా ప్రయత్నించారు. స్త్రీవాదులు చెప్పేదానికన్నా ఇంకా ఏదో ఉందనేదే అతని ధోరణి. వసుమతి అనే డాక్టర్ స్త్రీవాది. ఆమె స్త్రీవాదాన్ని సమర్థిస్తుంది. "స్త్రీలు కదా! జీవితం లేనివాళ్లు. వేల సంవత్సరాల నుంచి అణచివేయబడి ఉన్నారు. కొంత సెల్ఫిష్‌నెస్ ఉంటుంది. వాళ్లను ఎడ్యుకేట్ చేసుకోవాలి"- ఇది వసుమతి వాదన. దీన్ని పూర్తి సత్యంగా మహేంద్ర అంగీకరించడం లేదు. "వసుమతి మాటలు పూర్తిగా నిజాలుగా తోచవు. మరిన్ని నిజాలేవో వసుమతి పేర్కొన్న చీకటి చరిత్రలో దాగి ఉన్నాయి. పైకి చూడ ఇవి ఆడమగకు జరిగే యుద్ధాలుగా కనిపిస్తాయి. అవి ఎందు కోసం జరిగాయి?" - ఇదీ మహేంద్ర అంతర్మథనం.

కులాల మధ్య, జాతుల మధ్య సాంఘిక, ఆర్థిక అసమానతలున్నాయనేది సుస్పష్టం. ఇక స్త్రీపురుషుల మధ్య ఉన్న వ్యత్యాసానికి వస్తే స్త్రీని వస్తువుగానే గుర్తిస్తున్నాం తప్ప ఆమెకు వ్యక్తిగా గుర్తింపు లేదు. వ్యక్తిగా గుర్తింపు రావాలంటే ఆమె చైతన్యవంతురాలై తన వ్యక్తిత్వాన్ని తాను తీర్చి దిద్దుకొని సహజనియమాలను త్రోసిపుచ్చగలగాలి. స్త్రీ చైతన్యవంతురాలు కాకపోవడానికి ఆమె తరతరాల దాస్యంలో ఉండడమే కారణం. బాలిక రజస్వల అయి మహిళగా ఎదుగుతున్న క్రమంలోనే తనలోకి తాను ముడుచుకపోతున్నది. అంతర్ముఖురాలవుతున్నది. ఆమె చుట్టూ సమాజ నియమాలు సంకెళ్లు వేస్తున్నాయి. దీనికి ప్రధాన కారణం స్త్రీ 'శీలానికి' సమాజం వేసే శిక్ష. ఈ నేపథ్యంతో చూస్తే మహేంద్ర భార్య సగటు స్త్రీ. ఆమెకు వర్గ స్పృహ లేదు. అజ్ఞానం నేరమయితే జనాభాలోని 90 శాతం మంది ప్రజలు నేరస్థులే. వర్గ స్పృహ లేని ఒక స్త్రీని మహేంద్ర అనే వర్గ స్పృహ కలిగిన మేధావి పనిపిల్ల కథలో వివాహమాడుతాడు. ఈ ఇరువురి వివాహం ప్రజాస్వామిక ఉద్యమంలో భాగంగా సన్నిహితమై కలిసి ఉందామనే ఒప్పందం వల్ల జరిగింది కాదని కథ ద్వారా అర్థమవుతున్నది. మహేంద్రది పెద్దలు కుదిర్చిన వివాహమే అనుకోవాలి. కథను బట్టి ఆమె సంపన్న కుటుంబం నుంచి వచ్చినట్లు తెలుస్తున్నది. అందువల్ల సాధారణ స్త్రీకి ఉండే వ్యామోహాలన్ని మహేంద్ర భార్యకున్నాయి. ఆమెకు మామూలు స్త్రీ మాదిరిగానే కన్స్యూమర్ వస్తువుల పట్ల మక్కువ. ఈ వ్యామోహాన్ని తీర్చే ప్రయత్నం

కూడా చేస్తాడు మహేంద్ర. అయినా ఘర్షణలు తప్పవు. స్త్రీ వ్యక్తిగా ఎదగకుండా ఉండడానికి పురుషుడు కల్పించిన అనేకానేక భ్రమల్లో కన్యామరిజం కూడా ఒక్కటి. వ్రతాలు, నోములు స్త్రీని సమాజం నుంచి వేరు చేయడానికి పురుషుడు కల్పించినవే. "దేవుడు స్త్రీలకు ఉండాలి. పురుషుడికి వద్దు" అనే ఒక మహామహుడి మాటలు గుర్తు చేసుకుంటే అందులోని సత్యం బోధపడుతుంది. గృహాలంకరణ వస్తువుల్లో ఒక వస్తువుగా స్త్రీని ఉంచడానికి జరిగిన ప్రయత్నాల్లో ఒకటి కన్స్యూమరిజం. వ్రతాలు, నోముల మాదిరిదే కన్స్యూమరిజం కూడా. ఈ వెల్లువలో స్త్రీ కొట్టుకొని పోవడం ద్వారా తాను పురుషుడి మాదిరిగా ఒక వ్యక్తినే అనే భావన కలుగదు. పురుషుడు తన వ్యాపకాలన్నీ ముగిసిపోయి ఇల్లు చేరుకున్న తర్వాత భార్యతో పాటు తాను భార్య కోసమని సమకూర్చి పెట్టిన వస్తువులన్నీ సుఖశాంతులను సమకూర్చి పెట్టాలనుకుంటాడు. పైగా ఆమె కోర్కెల జాబితాలను చూపించి సమాజంలో సానుభూతి పవనాలను వాంఛిస్తాడు. ఆమె 'గయ్యాళి' కావడం పురుషుడికి ఒక ఆయుధం దొరకడం కింద లెక్క. అంతేకాకుండా ఆధిపత్య వర్గాలు కల్పిస్తున్న భ్రమల వెల్లువకు మన సమాజం కొట్టుకొని పోతున్నది. అభివృద్ధి అంటే సంపదను కూడబెట్టుకోవడమే– వ్యక్తిగత ఆస్తిని పెంచుకోవడమే. ఈ అభివృద్ధి వ్యక్తిగత సమర్థత ద్వారా మాత్రమే సాధ్యమవుతుంది. ఈ 'ప్రగతి' సాధించడానికి ఎన్నో అవకాశాలు ఉన్నాయని హోరెత్తేలా చెబుతున్న వాతావరణంలో ఒక సగటు స్త్రీ మహేంద్ర భార్య కన్నా గొప్పగా ఆలోచించడానికి అవకాశమే లేదు. ఆమె ఉద్యోగం చేస్తున్నది. కాబట్టి చదువుకున్న వ్యక్తి అనుకోవాలి. ప్రస్తుత విద్య చైతన్యానికి ప్రతీక కాదనే విషయం మేధావి అయిన మహేంద్రకు తెలిసి ఉండాలి. తెలియదంటే అతనిలోనే లోపం ఉంది. అయితే ఆమె కోర్కెలు తీర్చడం వల్ల కూడా సంఘర్షణ తప్పడం లేదు. చివరగా పనిపిల్లను పెట్టుకుందామని భార్య ప్రతిపాదించడం వల్ల జరిగే ఘర్షణ ద్వారా తామిద్దరి మధ్య (అంటే స్త్రీ పురుషుల మధ్య) సంబంధాల విషయంలో ఇంకేదో ఉందనే ఘర్షణకు లోనవుతాడు. పనిపిల్లను పెట్టుకోవడానికి అతను వ్యతిరేకి కాదు. ఆ పిల్ల పట్ల తన భార్య నీచంగా ప్రవర్తిస్తుంది. కాబట్టి తాను దాన్ని చూడలేడు. సున్నిత మనస్కుడైన మహేంద్రకు ఇదో ఘర్షణ. ఒక వేళ పనిపిల్లను పెట్టుకున్నా ఈ ఘర్షణ తప్పదని అతను నిర్ధారణకు వచ్చాడు. ఇద్దరం ఉద్యోగాలకు వెళ్లినప్పుడు పిల్లను చూసుకోవడానికి తన తల్లిని తెచ్చుకుందామంటే ఆమె ఉన్నా పనిపిల్ల ఉండాల్సిందేనని తన భార్య అంటుంది. ఆమె ఇలా అనడాన్ని మహేంద్ర మరో విధంగా అర్థం చేసుకుంటాడు. తన తల్లిని తీసుకురావద్దని చెప్పడమేనని అతను



అనుకుంటాడు.

రచయిత మొత్తంగా ఒక పద్ధతి ప్రకారం భార్యాభర్తల మధ్య జరిగే సంఘర్షణలు కూడా వర్గపోరాట రూపాలే అని చెప్పడానికి ప్రయత్నించాడు. దీనికి అనుగుణంగా కథను నడిపించాడు రఘుత్తోమరెడ్డి.

మహేంద్ర భార్య దోపిడీ చేసే వర్గ స్వభావం కలది కాబట్టి తనను దోపిడీ చేస్తూ వేధిస్తున్నది. తన దోపిడీకి గురయ్యే వర్గానికి చెందినది కాబట్టి దోపిడీ చేసే వర్గ స్వభావం గల తన భార్య తన తల్లిని తీసుకు రావద్దనుకుంటున్నది.

స్త్రీకి స్త్రీకి మధ్య జరిగినా, పురుషుడికి స్త్రీకి మధ్య జరిగినా అది వర్గపోరాటంలో మాత్రమే జరుగుతుందని రచయిత చెప్పదల్చుకున్నాడు. అందుకే మాంధాత, ఈదమ్మల మధ్య జరిగిన యుద్ధాన్ని చెప్పి వ్యతిరేక స్వభావాల మధ్య జరిగిన పోరాటంగా చూపాడు రచయిత. అదే విధంగా సమ్మక్క రుద్రమ్మతో తలపడినా వర్గపోరాటమేనన్నాడు. తన వాదనను మరింత బలంగా చెప్పాలనే వ్యామోహంతో రచయిత ఈ పని చేశాడు. అదే విధంగా పనిపిల్ల దోపిడీకి గురయ్యే వర్గానికి చెందినది కాబట్టి తన హక్కులను కాపాడుకోవడంలో భాగంగా జరిగిన కరువు దాడిలో భాగం పంచుకుంది. భార్యాభర్తల మధ్య వర్గవైషమ్యాలు తప్ప స్త్రీ అణచివేతకు మూలాలు లేవనే సంకుచిత వాదాన్ని రచయిత ముందుకు తెచ్చాడు. ఈ రచయిత వాదన ఒకానొక రాజకీయోద్యమ వాదనగా ముందుకు వచ్చింది. ఈ వాదనను పురుషాధిపత్య అహంకారానికి 'న్యాయబద్ధత'ను కల్పించడం కోసం రచయిత మహేంద్ర పాత్రను సృష్టించాడు.

స్త్రీవాదానికి ఉన్న నేపథ్యం ప్రస్తుతం బలంగా వీస్తున్న దళితవాదానికి కూడా ఉంది. స్త్రీ వాదాన్ని ఎదుర్కొంటున్న రీతిలోనే దళితవాదాన్ని ఎదుర్కొనే ప్రయత్నాలు జరుగుతున్నాయి. వీటిని అర్థం చేసుకోవడంలో మేధావులు సంకుచితంగా వ్యవహరిస్తున్నారు. వారు అంటున్నట్లు– 'వర్గ స్వభావం' సత్యమే. వర్గపోరాటం జరుగుతుంది. జరగాల్సిందే. కానీ దాన్ని ముందుకు నడిపించడానికి స్త్రీ, దళితోద్యమాలను కూడా వెన్నుదన్నుగా సమీకరించుకోక తప్పదనే వాస్తవాన్ని గుర్తించడం అవసరం. విప్లవ రాజకీయాలు విస్మరించిన కోణాలను స్త్రీ, దళితోద్యమాలు గుర్తు చేస్తున్నాయి.

**ఉదయం 'రసన', 27-2-1995**

# ఆ మూడు కథలు

తెలంగాణ కథ విస్తృతి పెరిగింది. మానవ జీవితంలోని వివిధ పార్శ్వాలను స్పృశిస్తూ అభివృద్ధి చెందుతున్నది. మునుపటిలా మూసపోసిన కథలు కాకుండా జీవితంలోని వివిధ కోణాలను తెలంగాణ రచయితలు స్పృశిస్తున్నారు. మానవ జీవితంలోని వైరుధ్యాలను ప్రతిబింబిస్తూ అద్భుతమైన చిత్రీకరణతో కథలు వస్తున్నాయి. ఈ స్థితిలో తెలంగాణలోని చేయి తిరిగిన రచయితలు ఇద్దరు రాసిన మూడు కథలు అత్యంత ప్రధానమైనవి. స్త్రీవాదం, వర్గపోరాటం అనే రెండు అంశాల దృష్ట్యా ఈ మూడు కథలకు అత్యంత ప్రాధాన్యం ఉంది. స్త్రీపురుష సంబంధాలు, వైర్గ వైరుధ్యాల దృష్టితో చూస్తే ఈ మూడు కథలు కూడా మనకు తెలంగాణ గ్రామాల్లోని కల్లోలం, విద్యావంతులై గ్రామాలకు దూరమైన వ్యక్తుల ఆర్తి అర్థం అవుతుంది. తుమ్మేటి రఘోత్తమరెడ్డి రాసిన పనిపిల్ల, జాడ కథలు, అల్లం రాజయ్య రాసిన మధ్యవర్తులు కథ స్త్రీపురుష సంబంధాలను, స్త్రీ పురుషుల మధ్య ఉండే వైరుధ్యాలను చిత్రీకరించడంతో పాటు వర్గ వైరుధ్యాలను విశ్లేషించాయి. ఒక విధంగా చూస్తే, ఈ మూడు కథలు కూడా దేనికదే భిన్నమైనవి. పనిపిల్ల కథలో భార్యాభర్తల మధ్య తలెత్తే ఘర్షణలను చిత్రీకరించారు. అల్లం రాజయ్య మధ్యవర్తులు కథలో కూడా భార్యాభర్తల మధ్య మానసిక సాన్నిహిత్యం కొరవడడం కనిపిస్తుంది. అదే విధంగా రఘోత్తమరెడ్డి జాడ కథలో కూడా అదే ప్రధానాంశం అయింది.

పనిపిల్ల కథలో మహేంద్ర అనే పాత్ర తన భార్యతో నిత్యం ఘర్షణ పడుతూ కారణాలను అన్వేషించే మార్గంలో పయనిస్తుంది. ఇందులో భాగంగా భార్య కోసం పనిపిల్లను వెతకడానికి మహేంద్ర స్నేహితుని ఊరికి వెళ్తాడు. అదే విధంగా జాడ కథలో తెలంగాణలోని సర్వసాధారనమైన పరిస్థితుల్లో మాదిరిగానే సుజాత అనే గృహిణి పోలీసులు మాయం చేసిన తమ్ముడిని వెతుక్కుంటూ వెళుతుంది. ఈ ప్రయాణంలో ఆమె తన భర్త మధుసూదన్‌తో తనకు ఎదురవుతున్న సంఘర్షణను నెమరు వేసుకుంటూ తనకు భర్తకు, తన తమ్ముడికి మధ్య ఉన్న వైరుధ్యాలను, శత్రుత్వాన్ని విశ్లేషించుకుంటూ వెళుతుంది. అల్లం రాజయ్య మధ్యవర్తులు కథలో డాక్టర్ నాగేంద్ర తన భార్యతో నిత్యం సంఘర్షణ పడుతూ తన సొంత ఊరికి బయలుదేరుతాడు. ఈ మూడు కథలు కూడా అద్భుత శిల్ప విన్యాసంతో పఠితలను చివరంటా తమతో నడిపిస్తాయి. అయితే ఈ మూడు కథల్లోనూ రచయితలు అత్యంత



క్లిష్టమైన అంశాలను విశ్లేషించడానికి పూనుకున్నారు. ఈ రచయితలకు ఒక స్పష్టమైన సామాజిక, రాజకీయ అవగాహన ఉంది. ఈ దృష్ట్యానే వారు వర్గ వైరుధ్యాల నిగ్గు తేల్చడానికి పూనుకున్నారు. పనిపిల్ల కథలో మహేంద్ర తన భార్యతో సంఘర్షణకు వర్గపోరాట రూపం ఇవ్వడానికి పూనుకున్నారు. తనకూ తన భార్యకూ మధ్య శత్రు వైరుధ్యమే తప్ప మిత్ర వైరుధ్యం లేదని స్పష్టంగా తనను తాను సమర్థించుకుంటాడు. కథంతా మహేంద్ర స్వగతంతో రచయిత నడిపించాడు. దీని వల్ల రచయిత రఘోత్తమరెడ్డి పనిపిల్ల కథలోని మహేంద్ర పాత్రను బలపరుస్తూ వచ్చిన విషయం స్పష్టంగా అర్థమవుతుంది. మహేంద్ర లోపాలను చిత్రీకరించడంలోనూ, మహేంద్ర భావజలపరంగా ఎదిగే క్రమాన్ని ఎత్తి చూపడంలోనూ రచయితకు దృష్టి లేదని కథను చదువుతూ వెళ్లే పాఠకులకు అర్థమైపోతుంది. మహేంద్రలో పరస్పర విరుద్ధ భావాల మధ్య సంఘర్షణ జరుగుతున్నట్లుగా కథ నడుస్తుంది. కానీ, మహేంద్ర వివిధ సందర్భాలలో ప్రకటించే నిర్ణయాలను బట్టి ఆ పాత్రను పూర్తి చైతన్యం పొందిన పాత్రగానే రచయిత మలిచినట్లు అర్థమవుతుంది. ఈ దృష్ట్యా పనిపిల్ల కథ స్త్రీవాద వ్యతిరేకమైనదే. ఈ రచయిత రాసిన చావువిందు కథను చదివితే రచయత పనిపిల్ల కథలో ఎవరి వైపున్నాడో స్పష్టంగా తెలుస్తుంది. చావువిందు కథలో తన భూముల ఆక్రమణకు భూస్వామి పడే ఆవేదననూ, ఆ కుటుంబ పరిస్థితిని కళ్లకు కట్టినట్లు చిత్రీకరించారు. అయితే పాఠకులు ఆ భూస్వామి వ్యథతో మమేకం కారు. బాధితుల పక్షాన, తెలంగాణ ఉద్యమాల పక్షాన ఉండే వారందరూ రచయిత భూస్వామిని బలపరుస్తున్నట్లు ఎక్కడా అర్థం చేసుకోరు. దీన్ని బట్టి రచయిత శిల్పనైపుణ్యం, కథను నడిపించిన తీరు ఎంత అద్భుతమైందో అర్థం అవుతుంది. అయితే ఇదే దృక్కోణంతో చూస్తే పనిపిల్ల కథలో రచయిత స్పష్టంగా కన్స్యూమర్ వస్తువులపై మక్కువ చూపే మహేంద్ర భార్యను దోపడీ చేసే వర్గానికి చెందిన స్త్రీగా స్పష్టమైన అవగాహనతోనే చిత్రీకరించారనిపిస్తుంది.

ఇక జాడ కథ విషయానికి వస్తే, 'వాన్ని ఇక ఈ జన్మకు చూడగలుగుతానో లేదో? ఇప్పుడు వాడెక్కడున్నాడో?' అని తమ్ముడి కోసం వెతుక్కుంటూ వెళ్లే సుజాత పూర్తి చైతన్యం పొందిన స్త్రీలా కనిపిస్తుంది. తన భర్త మధుసూదన్‌తో తనకు పొత్తు కుదరకపోవడాన్ని కూడా ఆమె విశ్లేషించుకుంటుంది. ఇద్దరి మధ్యా గొడవలు, అసంతృప్తులూ ముదిరిపోయి ఇద్దరి మధ్య దూరం పెరిగిపోవడాన్ని కూడా ఆమె అర్థం చేసుకుంటుంది. అరెస్టు అయిన తమ్ముడు బతికున్నాడో లేదోనని మథనపడుతూ అతని జాడ కోసం బయల్దేరిన సుజాత నిజానికి పూర్తిగా విప్లవోద్యమాల వైపు ఉన్న

స్త్రీ కాదు. అట్లాగే ఆమె భర్త మధుసూదన్ విప్లవ వ్యతిరేకి. ఇదే సమయంలో సుజాత తమ్ముడు అజ్ఞాత ఉద్యమకారుడు. ఈ స్థితిలో సుజాత తనకు అత్యంత ప్రీతిపాత్రుడైన తమ్ముడి కోసం సాధారణ స్త్రీలందరి మాదిరిగానే మథనపడుతుంది. తమ్ముడి జాడ కోసం అనేక కష్టనష్టాలు ఓరుస్తూ ముందుకు సాగుతుంది. ఇదే సమయంలో సుజాత ఎక్కడికి వెళ్లిందో అనే తపనతో ఆమె భర్త కూడా ఆమె వెనుకే ఆమెను వెతుక్కుంటూ బయల్దేరుతాడు. దీన్ని బట్టి మధుసూదన్ సుజాతలు ఒకే వర్గానికి చెందినవారని, ఒకే చైతన్యస్థాయి గలవారని అర్థం చేసుకోవచ్చు. అయితే, సర్వసాధారణంగా కుటుంబంలో స్త్రీపురుషుల మధ్య ఉండే వైరుధ్యాలే ఈ రెండు పాత్రల మధ్యా ఉన్నాయి. అయితే ఈ కథలో రచయిత స్త్రీవాద వ్యతిరేకిగా ఎక్కడా కనిపించడు. పరిస్థితిని నిష్పక్షపాతంగా వివరించే అభివృద్ధికర రచయితగా పాఠకుల ముందు నిలబడతాడు.

ఇక అల్లం రాజయ్య మధ్యవర్తులు కథలో కూడా భార్యాభర్తల మధ్య సంఘర్షణ కనిపిస్తుంది. ఈ కథలోని డాక్టర్ నాగేంద్ర భార్య సులోచన పనిపిల్ల కథలోని మహేంద్ర భార్యవంటిది. నాగేంద్రతో కూడా మహేంద్ర పాత్ర సరిపోలుతుంది. ఒక విధంగా మధ్యవర్తులు కథలో నాగేంద్ర పడిన మానసిక సంఘర్షణ పనిపిల్ల కథలో మహేంద్ర పడుతాడు. అయితే నేర్పంతా రచయిత కథను నడిపించడంలో ఉంది. ఇక్కడ తాను ఏ వర్గానికయితే చెందినవాడో ఆ అట్టడుగు వర్గానికి దూరమైన తీరును, తన ఊరికి తన వారికి దూరమైన పరిస్థితిని సంఘంలో హోదా పెరిగినప్పటికీ లభించని తృప్తిని, తన వృత్తి ద్వారా డబ్బులు సంపాదిస్తూ అన్ని సౌకర్యాలు కల్పిస్తున్నప్పటికీ తృప్తి పొందని భార్య నుంచి ఎదురయ్యే ఆటుపోట్లను నాగేంద్ర తట్టుకోలేకపోతుంటాడు. అయితే తప్పంతా నాగేంద్ర తన భార్య మీదనో, మరెవరి మీదనో నెట్టేయలేదు. తాను ఏ విధంగా తన వర్గానికి దూరమై రాజ్యప్రయోజనాల కోసం ఉపయోగపడుతున్నాడో నాగేంద్ర స్పష్టంగానే అర్థం చేసుకున్నాడు. అందువల్ల మధ్యవర్తులు కథలో పనిపిల్ల కథలోని మహేంద్ర తన భార్యపై వేసే నిందలను నాగేంద్ర తన భార్యపై వేయలేకపోయాడు. తను ఎటువైపున్నాడో కూడా నాగేంద్ర అర్థం చేసుకున్నాడు. నాగేంద్రలో పనిపిల్ల కథలోని మహేంద్రకున్న హిపోక్రసీ లేదు. మనలాంటి దేశాల్లోనైతే సకల అధికారాలకూ, దోపిడీకీ ఈ చదువుకున్నవాళ్లే మధ్యవర్తులు, గవర్నమెంట్ భాషలో చెప్పాలంటే వీళ్లే యంత్రాంగం అని నాగేంద్ర స్పష్టంగా తనను తాను విశ్లేషించుకుని స్పష్టం చేయగలుగుతాడు. అయితే పని పిల్ల కథలో కరువుదాడిలో పాల్గొన్న పనిపిల్ల ద్వారా మహేంద్ర అసలు నిజమేమిటో అర్థమైపోయినట్లు సంపూర్ణ వ్యక్తిగా చిత్రీకరించబడ్డాడు. అందువల్ల పనిపిల్ల కథలో



మహేంద్రను కాకుండా రచయిత రఘోత్తమరెడ్డిని తప్పుగా అర్థం చేసుకోవడానికి వీలు కలుగుతుంది.

జాడ కథలోనూ, చావువిందు కథలోనూ తన దృక్పథాన్ని అత్యంత సమర్థతతో ప్రదర్శించగలిగిన రఘోత్తమరెడ్డి పనిపిల్ల కథలో కూడా అదే సమర్థతను ప్రదర్శించారు. అందువల్ల పనిపిల్ల కథలో మహేంద్ర భావజాలపరంగా చైతన్యం పొందుతున్న పాత్ర కాదు. రచయిత మహేంద్ర పాత్ర ద్వారా స్త్రీవాదాన్ని కొట్టివేయడానికి ఎత్తుగడ వేశాడు.

**మహానగర్, 9-10-1995**

# సామాజిక చేతనకు ప్రతిరూపాలు

ఒక పుస్తకం మొదటి ముద్రణ ప్రతులు అమ్ముడుపోవడమే గగనం. అటువంటిది అంపశయ్య నాల్గవ ముద్రణ, ముళ్లపొదలు, అంతస్స్రవంతి నవలల ద్వితీయ ముద్రణలు విడుదలయ్యాయి. వాస్తవానికి మూడు వేర్వేరు నవలలు కావు; ఒకే నవల. ఒక దానికొకటి ఎక్స్‌టెన్షన్. అంపశయ్యకు సీక్వెల్‌గా రాయబడిన నవలలు ముళ్లపొదలు, అంతస్స్రవంతి. అంపశయ్యలో రవి విద్యార్థి దశను, ముళ్లపొదలు నవలలో నిరుద్యోగదశను, అంతస్స్రవంతిలో ఉద్యోగదశను చిత్రీకరించారు. ఈ మూడు నవలల్లో రవి క్రమవికాసం ఉంది. రవి చుట్టూ తిరిగిన మిగతా ప్రధాన పాత్రల వికాసపతనావస్థలూ చిత్రీకరించబడ్డాయి. కేవలం పాత్రల ప్రాధాన్యం మాత్రమే అయితే ఇన్ని ముద్రణలకు ఈ నవలలు నోచుకుని ఉండేవి కావు. సామాజిక పరిస్థితులను, మార్పులను కళ్లకు కట్టినట్లు చూపారు రచయిత నవీన్. అయితే సామాజిక చిత్రణ చేయడంలో ఆయన శిల్ప ప్రాధాన్యతను విస్మరించలేదు. ముక్కు పట్టుకొని రచయిత పాత్రలను నడిపించలేదు. "నవలంటే కథ మాత్రమే కాదని... నవలంటే వివిధ సంఘటనల్ని ముందే నిర్ణయించుకున్న ప్రకారం అమర్చడం కాదని... నవలంటే... పాత్రలని.... నవల ఆ పాత్రల బాహ్య స్వరూపాన్ని, బాహ్య చేష్టలను మాత్రమే కాకుండా వాళ్ల అంతరంగ ప్రపంచాన్ని, ఆ ప్రపంచంలో చెలరేగుతున్న వివిధ సంఘర్షణల స్వరూపాల్ని సమగ్రంగా చిత్రించేద"ని నవీన్ విశ్వసించడమే కాదు, నిరూపించారు కూడా.

"అంపశయ్యలోని ఇతివృత్తం, వాతావరణం, పాత్రలు, చిత్రణ, శైలి వాటికవే విశిష్టత కలవిగా, సమాజ జీవితంలోని అతి ముఖ్యభాగమైన ఉన్నత విద్యారంగానికి తీసి చూపిన ఎక్స్‌రేగా రూపొంది, ఈ రచనకు మరే నవలకూ లేని ప్రత్యేకతను సంతరించి పెట్టాయ"ని చలసాని ప్రసాదరావు ప్రశంసించారు. చలసాని ప్రసాదరావు మాటలు అంపశయ్య నవలను ఉద్దేశించి అన్నవే అయినప్పటికీ ముళ్లపొదలు, అంతస్స్రవంతి నవలలకు కూడా వర్తిస్తాయి. మూడు నవలలు కూడా మన విద్యావ్యవస్థ దుస్థితిని, దుర్మార్గాన్ని ఎత్తిచూపేవి. స్థూలంగా చూస్తే అంతే, కానీ సామాజిక రుగ్మతలను ఎత్తిచూపే నవలలు ఇవి. అంతేకాకుండా ఆ రుగ్మతలకు కారణాలను కూడా చూపే నవలలు. సాహిత్యానికి ప్రయోజనం ఉండాలనే తెగకు చెందిన రచయిత



నవీన్. అయితే ఈ నమ్మకంతో రచయిత ఎక్కడా పాత్రల్లో పరకాయ ప్రవేశం చేసి సృజనాత్మకతను దెబ్బ తీయలేదు. ప్రబోధాలు చేయలేదు. ప్రసంగాలు చేయలేదు. అసలు రచయిత కనిపించడు. పాత్రలే కనిపిస్తాయి. రచయిత ప్రతిభకు అదే గీటురాయి. అందుకే ఈ మూడు నవలలు కూడా సాహిత్యాభిమానుల మన్ననలు పొందాయి.

అంపశయ్య, ముళ్లపొదలు, అంతస్స్రవంతి ఒక రకంగా రచయిత ఆత్మకథ. ఈ నవలల్లోని ప్రధాన పాత్ర రవి రచయితనే. సామాజిక ప్రయోజనానికి 'ఆత్మాశ్రయం' గొడ్డలి పెట్టు లాంటిదని ఉద్యమ సాహితీ పండితులు గగ్గోలు పెట్టిన కాలంలోనే ఈ రచనలు వచ్చాయి. ఆత్మాశ్రయ రచనలు సామాజిక వాస్తవికతను బలంగా చిత్రీకరించగలవనే విషయాన్ని నవీన్ దళిత, స్త్రీవాద రచనలు రాకముందే నిరూపించారు. "ఒక తపస్సులా సాగిన ఈ రచనకు ప్రధానమైన ప్రేరణ వైయక్తిక విముక్తి.. డి.హెచ్. లారెన్స్ ఆర్ట్ ఈజ్ ఫర్ మై సేక్! అని ఎందుకన్నాడో నాకు అంపశయ్య రాశాక అర్థమైంది" అని నవీన్ "అంపశయ్య నేనెందుకు రాశాను" అనే ప్రశ్న వేసుకుని జవాబిచ్చుకున్నారు. 'వైయక్తికత' అనేది సామాజిక వాస్తవికతను ప్రతిఫలిస్తుందనే విషయాన్ని నవీన్ నవలలు నిరూపిస్తాయి. "అంతస్స్రవంతి ఒక చేతనకు ప్రతిరూపం. అందుచేత దీన్ని ఆత్మాశ్రయ రచనగా కాక, వస్తునిష్టమైన రచనగా నిర్దేశించవలసిన అవసరం ఉన్నద"ని ఆర్.ఎస్. సుదర్శనం 1991లో అంతస్స్రవంతి నవలకు రాసిన ముందుమాటలో అన్నారు. నిజానికి మూడు నవలలు కూడా ప్రథమంగా ఆత్మాశ్రయాలే. ఆత్మాశ్రయ సాహిత్యం సమాజాన్ని విస్మరిస్తుందనే అపోహ ఉన్నందననే అంతస్స్రవంతి నవల ఆత్మాశ్రయం కాదని చెప్పి దానికో 'ఉన్నతస్థాయి' కల్పించాలని సుదర్శనంగారు భావించినట్లు తోస్తోంది. ఆత్మాశ్రయ సాహిత్యం తప్పనిసరిగా సమాజాన్ని ప్రతిఫలిస్తుందనేది ఇవాళ మన అనుభవంలోకి వస్తోంది. నవీన్ అచ్చమైన సృజనాత్మక రచయిత కాబట్టే ఆత్మాశ్రయానికి, వస్తునిష్ఠ సాహిత్యానికి మధ్య ఉన్న అభేదాన్ని మన ముందుంచారు.

'అంపశయ్య' నవలలోనే కాదు ముళ్లపొదలు, అంతస్స్రవంతి నవలల్లో కూడా రచయిత రవి మానసిక సంఘర్షణను ప్రతిభావంతంగా చిత్రీకరించారు. రవి తన చుట్టూ ఉండే వ్యక్తుల అంతరంగాలను, వారిలోని మంచిచెడులను నిష్పాక్షికంగా అర్థం చేసుకోవడానికి పడే తపనను చూపించాడు. రవి చేసే అంతర్, బాహిర్ యుద్ధారావాలను రచయిత వినిపించారు. మానవ జీవితంలోని వైరుధ్యాలను కళ్లకు కట్టినట్లు చూపారు. కుహనా విలువల దుమ్ము దులిపారు. ఒక వ్యక్తిలోని

మంచిచెడులకు మధ్య జరుగుతున్న సంఘర్షణను చిత్రీకరించారు రచయిత. మానవ చైతన్యాన్ని పరిస్థితులు నిర్దేశిస్తాయనే సూక్తిని అక్షరాల నిరూపించిన నవలలు ఇవి. మనిషి అన్ని వేళలా ఒకే రకంగా ప్రవర్తించడనే విషయాన్ని అర్థం చేసుకోగల రచయిత మాత్రమే ఇంత మంచి రచనలు చేయగలడు. సమాజాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేసిన రచయిత మాత్రమే ఉత్తమ నవలలు రాయగలరనేది నవీన్ తన నవలల ద్వారా రుజువు చేశారు.

అంపశయ్య నవలలో రవి విశ్వవిద్యాలయం చదువులకు వచ్చేసరికి విశాల ప్రపంచం తలుపులు తెరుచుకుని ఉంటాయి. అనేకానేక ప్రలోభాలకు గురి చేస్తుందీ ప్రపంచం. తెలంగాణ ప్రాంతంలోని వ్యక్తులు విశాల ప్రపంచానికి అలవాటు పడనివారు. ఒక్కసారి సంకెళ్లు తెగినట్లు అనిపించేసరికి రవి అన్నింటి వైపూ ఆకర్షితుడవుతాడు. ఎండమావుల వెంట పరుగులు తీస్తాడు. మథనపడ్తాడు. నిరాశ చెందుతాడు. అప్పుడు వీస్తున్న శ్రీకాకుళోద్యమం అతడ్ని ఎంతగా ఆకర్షిస్తుందో, కిరణ్మయి అందమూ అంతే ఆకర్షిస్తుంది. ఉత్తమ సాహిత్యం ఎంతగా చలింపజేస్తుందో, సెక్స్‌వాంఛా అంతే చలింపజేస్తుంది. ఈ రెంటి మధ్య అతడు నలిగిపోతాడు. రవి పాత్రను చిత్రీకరించడంలో రచయితకు హిపోక్రసీ లేదు. అందుకే మొదటి నవలే అయినప్పటికీ సాహిత్య ప్రపంచంలో అంపశయ్య సంచలనం సృష్టించింది. ముళ్లపొదలు నవలలో రవి, అతని మిత్రుల నిరుద్యోగదశను వస్తువుగా స్వీకరించాడు. రవితో పాటు వేణు, సాగర్, రమేష్, నిధి తమ గమ్యాలను నిర్దేశించుకున్న దశ కూడా ఇదే. ఈ ఐదుగురే అంపశయ్యలో కూడా ప్రధాన పాత్రలు. రవి కాలేజీ లెక్చరర్ కావాలనుకుంటాడు. వేణు విప్లవోద్యమం వైపు అంపశయ్య నవలలోనే మొగ్గు చూపుతాడు. సాగర్ తెలంగాణ ఉద్యమం వైపు వెళ్తాడనేది 'అంపశయ్య' నవలలోనే సూచనప్రాయంగా చెప్పాడు. రమేష్ అమెరికా వెళ్లాలని కలలు కంటున్న విషయాన్ని రచయిత చూపించాడు. నిధిది అరాచక ప్రవృత్తి. ముళ్లపొదలులో వీరు తమ లక్ష్యాల సాధన కోసం పడే సంఘర్షణ కనిపిస్తుంది. అదే సమయంలో ఆనాటి ప్రత్యేక తెలంగాణ ఉద్యమం పట్ల వారివారి అవగాహనలను కూడా రచయిత చిత్రీకరించారు. ప్రత్యేక తెలంగాణ ఉద్యమం ప్రజాజీవితంపై చూపిన ప్రభావాన్ని సమర్థంగా చిత్రీకరించిన నవల ముళ్లపొదలు. తెలంగాణ ఉద్యమాన్ని సాగర్ తాను రాజకీయ నాయకుడిగా ఎదగడానికి వాడుకున్న వైనాన్నే కాకుండా ఆ ఉద్యమాన్ని రాజకీయ నాయకులు స్వార్థ ప్రయోజనాల కోసం వాడుకున్న వైనాన్ని కూడా రవి దృష్టితో సమర్థవంతంగా చూపించారు నవీన్. ఆనాటి విప్లవ కవులు ప్రత్యేక తెలంగాణ



ఉద్యమాన్ని తప్పుగా అర్థం చేసుకున్నారనే విషయాన్ని రచయిత ఆ రోజే అర్థం చేసుకోగలిగారు. విప్లవ రచయితగా ఎదిగిన వేణు ఆనాటి విప్లవ మేధావులకు ప్రతినిధి. వేణుది తప్పుడు అంచనా అనే విషయాన్ని రవి ద్వారా చెప్పించాడు రచయిత.

అంతస్స్రవంతి నవల రవి దాంపత్య జీవితానికి, అధ్యాపక వృత్తికి సంబంధించింది. రచయితను కావాలనుకునే అంపశయ్య రవి రచయితగా ఎదిగిన దశ ఇది. విప్లవోద్యమానికి, 'జాతీయవాదులకు' మధ్య జరిగిన సమకాలీన సంఘర్షణలకు అద్దం పడుతుందీ నవల.

మొత్తంగా ఈ మూడు నవలలు తెలంగాణ సామాజిక చరిత్రకు నిలువుటద్దాలు. సమాజంలోని ప్రతి మార్పును అక్షరీకరించిన నవలలు ఇవి. ఈ నవలలు చదువుతుంటే ముసుగును తీసేసి మనల్ని మనం పరీక్షించుకుంటున్న అనుభూతికి లోనవుతాం. ఈ నవలలు ప్రధానంగా రచయిత స్వీయవేదనలకు, అంతర్మథనానికి చెందినవే అయినప్పటికీ మనకందరికీ చెందినట్లనిపిస్తాయి. అందుకే ఇవి ఉత్తమ నవలలు అయ్యాయి. వస్తువుకు, శిల్పానికి సమన్వయం కుదిర్చిన రచనలు ఇవి. వస్తు ప్రాముఖ్యాన్నే కాకుండా శిల్ప ప్రాముఖ్యాన్ని కూడా ఈ నవలలు వివరిస్తాయి.

**'సృష్టి' వార్త దినపత్రిక, 15 జులై 1996**
**నిత్యనవీనుడు, డిసెంబరు 2001**

# రక్తం చేత రాగాలాపన

"ప్రపంచమొక పద్మవ్యూహం
కవిత్వమొక తీరని దాహం"– నిజమే.

పద్మవ్యూహం వంటి ప్రపంచంలో కవిత్వ వస్తువు అనేకం. భిన్నభిన్న వస్తు స్వీకరణతో, భావాలతో తెలుగులో కవిత్వం విరివిగా వెలువడుతున్నది. దానికి తగ్గట్టు సాహితీ విలువలకూ కొదవలేదు. కవిత్వంలో స్తబ్దతా లేదు, తెలుగు కవిత్వం నీరసపడిపోనూ లేదు. జీవకవిత్వం, సజీవ కవిత్వం ఉనికిని స్థాపించుకుంది.

వస్తు స్వీకరణను బట్టి ఆధునిక (నేటి) కవివర్గాన్ని స్థూలంగా మూడు విభాగాలు చేయవచ్చు. 1. విప్లవ కవులు 2. అనుభూతివాద కవులు 3. మధ్యేమార్గ కవులు.

నేడు విప్లవ కవిత్వం బలంగా వస్తున్నది. 1970లో విరసం ఆవిర్భావంతో ప్రారంభమైన విప్లవ కవిత్వం తన కర్తవ్యసాధనలో నిమగ్నమై ఉంది.

పెండాల్య వరవరరావు ప్రజల కోసం తనదైన వాణిలో కవిత్వాన్ని రచిస్తూనే ఉన్నారు. ప్రభుత్వ ఆగ్రహానికి గురై అనేక కేసుల్లో ఇరుక్కున్న విప్లవకవి వరవరరావు. ఆయన రచించిన 'భవిష్యత్తు చిత్రపటం' కావ్యాన్ని ప్రభుత్వం నిషేధించింది.

'నాకిక్కడ సుఖంగా ఉన్నదా అని నువ్వడిగావు
ఈ విశాలదేశం కోట్లాది జనంగుండెల్లో
మబ్బులో దాగిన మెరుపులా వెలుగుతున్న
భవిష్యత్తు మీద ఆశ ఈ సంకెళ్లలో ధ్వనిస్తున్నది'– అని అన్న వరవరరావు

చేతులకు సంకెళ్లతో తన భావనావీధిలో ప్రజలకు చోటు కల్పిస్తూనే ఉన్నారు. ఆయనది సజీవ కవిత్వం. అయితే ఆయన వ్యక్తిత్వాన్ని ప్రశంసించే యువకవుల్లో ఆయన కవిత్వం వల్ల ప్రభావితులైనవారు అరుదే. విప్లవ కవిత్వంలో ఆయన ఉన్నత స్థానం ఆయనకు ఎప్పుడూ ఉంటుంది.

'అమ్మ కళ్ల నిండా నీళ్లు
నా చేతుల్నిండా
మూతినిండా రక్తం
అప్పుడే తెలుసుకున్నాను
నా వంటి వాళ్ల అమ్మపాలు



తెల్లగా కాదు ఎర్రగా ఉంటాయని'– అని చెప్పిన నగ్నముని కవిత్వం, కవిత్వపరిచయం ఉన్నవాళ్లందరి హృదయాలను తాకుతుంది. "ప్రతి తల్లి ఒక సూర్యుణ్ని ప్రసవిస్తే చాలు" అన్న నగ్నముని కలం అరుదుగా కన్పిస్తున్నది.

అదే విధంగా జ్వాలాముఖి కూడా ఎప్పుడో కాని కన్పించడంలేదు. ఇక నిఖిలేశ్వర్ కవిత్వం తరచూ కన్పిస్తూనే ఉన్నా పాఠకులను అంతగా కదిలించలేకపోతున్నది.

"మంటలేని దుఃఖమెందుకు కళ్లనిండా" అని ఆగ్రహించిన కె. శివారెడ్డి 'నేత్రధనుస్సు' సంధించి పుంఖానుపుంఖంగా కవితాస్త్రాలు సంధిస్తూనే ఉన్నారు. 'శబ్దాన్ని కూడా పుటం పెట్టి పరీక్షించుకోవాలి' అని చెప్పిన శివారెడ్డి నేడు విప్లవ కవిత్వాన్ని నడిపిస్తున్నాడు. 'రక్తంసూర్యుడు', 'ఆసుపత్రి గీతం', 'నేత్రధనుస్సు'ల్లో హృదయాలను కదిలించే కవిత్వం రాసిన శివారెడ్డి 'భారమితి', 'మోహనా, ఓ మోహనా'ల్లో మెదళ్లను కదిలించే ప్రయత్నం చేశారు. ఈ మెదళ్లన కదిలించే పనినే ఆయన కవిత్వం ద్వారా కొనసాగిస్తున్నారు. ఆయన వాడుతున్న ప్రతీకలు ప్రజల వాడుకలో కనిపించేవి కావు. ఆలోచించి, ఆలోచించి ప్రతీకలు (ఇమేజెస్) వేస్తున్నట్లుగా తోస్తున్నది. కవిత్వం గాఢతను సంతరించుకుంటున్నది. సంక్లిష్టమవుతున్నది. తద్వారా కవిత్వం మరింత ఉత్తమంగా వస్తున్నదనే వాదన బలంగా ఉన్నది. వాదనలు ఎన్నయినా చేయవచ్చు. సమర్థించుకోనూ వచ్చు. కాని కాస్త అర్థమయ్యేలా రాయడానికి వీలుంది. శివారెడ్డి కాస్తా రూపానికి ఇచ్చే అధిక ప్రాధాన్యాన్ని తగ్గించుకుంటే మంచిది. పదాల ద్వారా, ప్రతీకల ద్వారా కవిత్వాన్ని సంక్లిష్టం చేయకూడదని మనవి. అయితే శివారెడ్డి కవిత్వానికుండే ఉన్నత స్థానం ఎప్పుడూ ఉంటుంది. ఆయన కవిత్వం వల్ల ప్రేరణ పొందిన యువకులు కొందరు అదే రీతిలోనూ, మరికొందరు కాస్త సడలింపులతో (రూపం విషయంలో) కవిత్వాన్ని వెలువరిస్తున్నారు. నేడు విప్లవ కవిత్వ గమనాన్ని శివారెడ్డి కవిత్వం నిర్దేశిస్తున్నది.

ఆధునిక సంక్లిష్ట వచన కవితాస్వరూపాన్ని పరిపూర్ణంగానూ, సారభూతంగానూ, భౌతికంగానూ, తాత్వికంగానూ పట్టుకున్న కవి సిధారెడ్డి అని శివారెడ్డి ప్రశంసించిన నందిని సిధారెడ్డి ప్రతిభావంతమైన కవిత్వం వెలువరిస్తున్నారు. నందిని సిధారెడ్డి కవిత్వం చాలా మటుకు సుభోదకమవుతుంది. ఆయన వాడే ప్రతీకలే అందుకు కారణం.

"జీవితం పొడుగునా అగ్నిని పొడదల్చుకున్నాను
జీవితం కోసం

జీవితం పొడుగునా జీవితంలోని అగ్నిని కాపాడదల్చుకున్నాను" అని పాడుతున్న సిధారెడ్డి కవిత్వ ఆయువుపట్టును పట్టుకున్నాడు. శివారెడ్డిలోని ఉత్తమ లక్షణాలను గ్రహించి లోపాలను (ఆ లోపాలు కొంచెమే) విడిచి పెట్టి స్వంత గొంతుకను పలికిస్తున్న కవి సిధారెడ్డి.

శివారెడ్డి కవిత్వ ప్రభావం నుంచి తప్పుకోలేని, తప్పుకోవడానికి ఇష్టపడని కవి నారాయణస్వామి.

"చివరిసారిగా

నీ నెత్తురు పూసిన వేళ్ల చివరన స్పృశించిన వెచ్చని తడి

నా పక్కటెముకల్లో ఊపిరై గుచ్చుకుంటుంది"- ఇది రిక్కల సహదేవరెడ్డి స్మృత్యర్థం నారాయణ స్వామి రాసిన 'సహదేవా!' కవితలోని పంక్తులు. ఈ భావాన్ని ఇంతకన్నా సరళంగా కవిత్వ విలువలు కొరవడకుండా రాయడానికి వీల్లేదా?

ఇదే విధంగా శివారెడ్డి ప్రేరణతో గాఢతర కవిత్వాన్ని విరచిస్తున్న యువకుల్లో సుధాకిరణ్, తదితరులు ఉన్నారు. వీరు వాడే ప్రతీకలు వస్తువును మరుగుపరుస్తున్నాయి. అవునన్నా కాదన్నా త్రిపురనేని శ్రీనివాస్, జూకంటి జగన్నాథం, ఆశారాజు, కాట్రగడ్డ దయానంద్, దర్భశయనం శ్రీనివాసాచార్య, ఇంకా చాలా మంది శివారెడ్డి కవిత్వ రూపాన్ని ఆదర్శంగా గైకొని కవిత్వాన్ని వెలువరిస్తున్నారు.

"…. ఇక్కడ

మనం మేల్కోవడం అవసరం

నివురు శిరస్సును ఖండించడం అవసరం

గుండెగుండెనా దీపాలు పెట్టడం కాక

గుండెలపై సూర్యుణ్ని ముద్రించడం అవసరం

సామూహికతా భేరిని మోగించడం అవసరం" - అని నమ్ము స్పష్టంగానే పలుకుతున్నాడు.

"మళ్లీ మనపాపలు ఈ వంటరి వంటిళ్లలోకి

అడుగిడబోతున్నారు

మన పిల్లల కోసం

వంటరి వంటగదుల్ని కూల్చేందుకు రండి" అని పిలిచే విమల స్పష్టాతిస్పష్టంగా రాస్తున్నారు.

దేవీప్రియ ప్రజాకవిత్వాన్ని ముందుకు నడిపిస్తున్నారు.

"మాతృభూమిని మానభంగం చేస్తున్నవాడా మరవకు



నేను నడిస్తే నేల భగ్గుమంటుంది

మండే మట్టి

నీకు మరణశయ్య అవుతుంది"- ఎంత స్పష్టంగా కవితామయంగా రాశాడు గుడిహాళం రఘునాథం. సుంకిరెడ్డి నారాయణరెడ్డి కూడా ప్రతిభావంతంగా రాస్తున్నాడు.

"హత్యకు గురైన వీరుని శిరస్సు

విముక్తి గీతం వినిపిస్తున్నది" అనే జ్వాలాసాగర్ మంచి కవిత్వాన్ని వెలువరిస్తున్నాడు.

అలిశెట్టి ప్రభాకర్ తనదైన బాణీలో కవిత్వాన్ని విరచిస్తున్నాడు. ఆయన కవిత్వం సాధారణ పాఠకులకు కూడా అర్థమవుతుంది. ఆయన కవిత్వంలో భావ సంక్లిష్టత గానీ, అర్థ సంక్లిష్టత గానీ మచ్చుకైనా కనపడవు.

జయప్రభది ప్రత్యేక మార్గం. ఫెమినిస్టు దృక్పథం తనదని చెప్పుకుంటుంది. 'పైటను తగలెయ్యాలి', 'స్పర్శ' వంటి కవితా ఖండికలు ఆమె ప్రతిభను వెల్లడిస్తాయి. అయితే పీడితుల, బాధితుల గురించి వర్ణిస్తూ విప్లవమే మార్గమని చెప్పే ఆమె కవితలు చాలా వరకు పేలవంగా ఉన్నాయి. సౌదా కవిత్వం పలువురి ప్రశంసలు అందుకుంటున్నది.

విప్లవ కవితావనంలో అగ్నిపుష్పాలను వెలువరిస్తున్న కవులు అనేకం. సాగర్, ఎన్. తిర్మల్, సౌభాగ్య, అరణ్యకృష్ణ, ఉదయమిత్ర, ఎన్. వేణుగోపాల్, కానూరి వేంకటేశ్వరరావు, వసీరా, పద్మ, ఇంకా చాలా మంది.

విప్లవ కవిత్వం విరివిగానే వస్తున్నది. సాహిత్యం మీద అభిలాష ఉన్నవారికి సభోదకమవుతున్న కవిత్వం అధికమే. పదచిత్రాల వ్యామోహం రోజురోజుకూ అధికమవుతున్నది. ఇది నూటికి నూరుపాళ్లు శివారెడ్డి కవిత్వ ప్రభావమే. సరళంగా కవిత్వాన్ని మాట్లాడే కవులు కూడా ఈ ప్రలోభానికి లొంగిపోతున్నారు. కవిత్వాన్ని నెమరేసుకుంటున్నకొద్దీ కొత్త అర్థాలు స్ఫురించాలి. తద్వారా కవి ఉద్దేశించిన భావాలు పఠితల మనస్సుల్లో ముద్రితం కావాలి. శ్రీశ్రీ కవిత్వం కానీ, చెరబండరాజు కవిత్వం కానీ చదివితే మనకు మొదట కలిగేది ఉత్సాహమే. అయితే శివారెడ్డి కవిత్వాన్ని చదవడం మొదలు పెట్టగానే మెదడును పట్టుకుంటుంది. కవిత్వం చదవడానికి అభ్యాసం కొంత వరకు అవసరమే కానీ రెండు పంక్తులు చదవగానే ఆపేసేట్లుగా ఉండకూడదు. శివారెడ్డి 'హోటల్లో బరంపురం' శీర్షికతో పాటు ఆ కవిత బ్యాక్‌గ్రౌండ్ తెలిస్తేనే అర్థమవుతుంది. బరంపురంలోని ఒక హోటల్లో కవి కూర్చున్నప్పుడు బరంపురంలోని తెలుగువాళ్లు ఒంటరివాళ్లుగా కవి మనసుకు అనిపించింది.

బరంపురంలోని హోటల్లో కూర్చున్నప్పుడు వచ్చిన ఆలోచన కాబట్టి కవితా శీర్షిక 'హోటల్లో బరంపురం' అయింది. (ఇది నిజమో కాదో శివారెడ్డి చెప్పాలి). ఈ విధంగా కవితా వెనుకా ముందులు చెబుతూ కవిత్వానికి వ్యాఖ్యానం కూడా అవసరమయ్యే పరిస్థితి ఏర్పడింది. ఈ విధంగా పదచిత్రాల వ్యామోహాన్ని చాలా వరకు తగ్గించుకొని ప్రజలకు అందుబాటులో ఉన్న పద చిత్రాలను గైకొనాలని ప్రజల కోసం రాసే కవులందరికీ నా విజ్ఞప్తి.

ఇక శివసాగర్ కవిత్వంలో ఈ పదచిత్రాలు పాఠకులను బాధపెట్టవు. ఆయన 'నరుడో భాస్కరుడా!' గేయం తెలుగు విప్లవ కవిత్వానికి మకుటాయమానం.

"బర్రెంక చెట్టు కింద నరుడో భాస్కరుడా!

... బందూకు పట్టివయ్య నరుడో! భాస్కరుడా!"– అంటూ చాగంటి భాస్కరరావుపై తెలంగాణ జానపద గేయరీతిలో రాసిన పాట ఇది.

"అలలపై నిఘా
అలలు కనే కలలపైన
నిఘా
అలలపై అనురాగం చూపించే చిరుగాలి
సితార సంగీతంపై నిఘా"– శివసాగర్ రాసిన ఈ కవిత ఆయన శక్తికి అద్దం పడుతుంది. విప్లవపోరాట యోధుడైన శివసాగర్ శక్తివంతమైన గొంతుకను విన్పించారు. కవితాహృదయాన్ని పట్టుకొని ఆయుధంగా ప్రయోగిస్తున్నాడు.

ఇక విప్లవ వాగ్గేయకారుల్లో ఎన్నదగినవారు గద్దర్, వంగపండు ప్రసాదరావులు. గద్దర్ నృత్యం చేస్తూ గానాలాపన చేస్తుంటే స్పందించని శ్రోత ఉండడు. రక్తం వేడుక్కుతుంది. ప్రజల భాషలో, ప్రజల కోసం, ప్రజలకు అర్థమయ్యే రీతిలో గేయాలు రాసి ఆలపిస్తున్నారు గద్దర్.

"అద్దమోలె మెరిసేటట్టు
నీ బూట్లు తుడిసినోల్లు
గంజిలో బట్టలుత్కి
కడకిస్త్రి జేసినోల్లు
నీ కాల్ల గోల్లు దీసి
గద్దాలు జేసినోల్లు
పెయ్యంత నూనె రాసి
మాలీసు చేసినోల్లు



పిడికిండ్లు ఎత్తినారు
పండేసి తొక్కుతారు" అని గద్దర్ అభినయిస్తూ పాడినప్పుడు రక్తం ఉప్పొంగని ప్రేక్షకుడు ఉండడు.

"ఏం పిల్లో ఎల్దామొత్తవా
శ్రీకాకుళములో– సీవకొండకీ
సిలకలు కత్తులు– దులుపరిత్తయంట
ఏం పిల్లో ఎల్దమొత్తవా" అని విశాఖ, శ్రీకాకుళం మాండలికాల్లో గేయరచన చేసిన విప్లవ భావప్రచారకుడు వంగపండు ప్రసాదరావు.

ఈ బాణీలో పాటలు రాస్తున్న కవులెందరో ఉన్నారు. కాని వారు గద్దర్, వంగపండుల్లా శక్తివంతంగా రాయలేకపోతున్నారు. దీనికి కారణం– నాగరిక, జానపదశైలీ సమ్మేళనంతో పాటలు రాయడమే. 'శక్తి'ని ఇందుకు ఉదాహరణగా పేర్కొనవచ్చు. ఆయన కూడా అభినయపూర్వకంగానే గేయాలాపన చేస్తాడు. ఆయన జానపద రీతి గేయంలో పుస్తకాల భాష మధ్యమధ్యన దర్శనమిస్తూ ఉంటుంది. చెరబండరాజు వచనకవిత్వం ఎంత ప్రతిభావంతంగా, శక్తివంతంగా రాయగలిగాడో గేయాన్నీ అంతే ప్రతిభావంతంగా, శక్తివంతంగా రాయగలిగాడు.

విప్లవ వచన, గేయ కవిత్వాలు నేడు పురోగమనదశలోనే ఉన్నాయి. శ్రీశ్రీ, చెరబండరాజు, సుబ్బారావు పాణిగ్రాహి వేసిన బాటలపై కవులు సాగుతూనే ఉన్నారు.

ఈ ప్రజాకవులందరూ కనీస సాహితీ పరిచయం ఉన్నవాళ్లందరికీ చేరాలన్నదే పలువురి ఆకాంక్ష

ఈ వ్యాసంలో మధ్యేమార్గ (మానవతావాద కవులు ఇందులోకే వస్తారు), అనుభూతివాద కవుల గురించి చర్చించలేదు.

**ఉదయం వీక్లీ ఉగాది ప్రత్యేక సంచిక, ఏప్రిల్ 1989**

# కవిత్వాలకు ఉద్యమాలు రాలవు!

తెలుగు సాహిత్యంలో ప్రస్తుతం కొన్ని విపరీత ధోరణులున్నాయి. రాజకీయ, సామాజిక ఉద్యమాలు, ముఖ్యంగా రాజకీయ ఉద్యమాలు సాహిత్యం ద్వారా వస్తాయనేది ఆ విపరీత ధోరణుల్లో ఒకటి. ఇటీవల వచ్చిన బిసి కవితా సంకలనం 'వెంటాడే కలాలు' ఇందుకు ప్రబల నిదర్శనం. దళిత సాహిత్యం విషయంలోనే కొందరు ఉద్యమాలు వచ్చేస్తాయని భ్రమపడ్డారు. నిజానికి, దళిత సాహిత్యానికో నేపథ్యం ఉంది. ఆ నేపథ్యం రాజకీయ, సామాజిక ఉద్యమాల రూపంలో ఉంది. దళిత స్పృహ సామాజికంగా పెరుగుతున్న కొద్దీ సాహిత్యంలో అది ప్రతిఫలిస్తూ వచ్చింది. దీని వల్ల అది ఒక వాదంగా నిలబడగలిగింది. సమాజంలోని రుగ్మతలపై, అన్యాయాలపై, అసమానతలపై మొదట సృజనాత్మక సాహిత్యం ఆక్రందనగా, ఆక్రోశంగా వెలువడుతుంది. లేదంటే, సామాజిక, రాజకీయ ఉద్యమాలు ప్రబలంగా ఉన్నప్పుడు వాటి ప్రభావంతో వస్తుంది. సామాజికంగా తమకు జరుగుతున్న అన్యాయాల స్పృహ పెరిగి, అది కార్యాచరణగా ముందుకు వచ్చిన తర్వాత వాటి ప్రభావంతో సాహిత్యం వెలువడడం చూస్తాం. నిజానికి, సాహిత్యం మనిషిలో పరివర్తనకు దోహదపడుతుందే తప్ప అదే ఉద్యమం ఎప్పుడూ కాదు. ఒక ఉద్యమానికి ప్రచార సాధనంగా కూడా సాహిత్యం వెలువడి అదే ఒక సాహిత్య ఉద్యమంగా, సాహిత్య ధోరణిగా స్థిరపడిపోతుంది. విప్లవ కవిత్వం విషయంలో అదే జరిగింది. విప్లవ సాహిత్యోద్యమం ప్రశ్నలను ఎదుర్కొన్న పరిస్థితి కూడా దళిత సాహిత్యం వేగంగా ముందుకు రావడానికి తోడ్పడింది. విప్లవ సాహిత్యోద్యమాన్ని ప్రశ్నించి కులాన్ని ముందుకు తేవడంలో విప్లవ సాహిత్యాన్ని ప్రశ్నించిన వారున్నారు. సుంకిరెడ్డి నారాయణరెడ్డి 'తోవ ఎక్కడ' అనే కవితా సంకలనం ఇందుకు ఉదాహరణ. అంతకు ముందు విపశ్యన కవులు ఆ పని చేశారు. అలాగే నగ్నముని ప్రజాస్వామ్య కవిత పేర సాహిత్య మార్పునకు ప్రయత్నం చేశారు. దళిత, స్త్రీవాద ఉద్యమాలకు కూడా ఆ నేపథ్యం ఉంది. అయితే దళిత కవులు తమకు జరుగుతున్న అన్యాయాలపై, అగ్రవర్ణాల మీద ఆగ్రహాన్ని కవిత్వంగా మలిచారు. ఈ కవిత్వం రావడానికి ముందు రాజకీయాల్లో ఆ వాతావరణం ఏర్పడి ఉంది. కాన్షీరామ్, ములాయం సింగ్ యాదవ్,



లల్లూ ప్రసాద్‌యాదవ్‌లు రాజకీయ క్షేత్రంలో అప్పటికే దళిత కంఠాన్ని వినిపించారు. ఇక్కడ మాదిగ దండోరా ఉద్యమం ఉంది. ఇదంతా దళిత కవిత్వానికి నేపథ్యం. స్త్రీవాద సాహిత్యానికి కూడా ఈ రకమైన సామాజిక, సాంస్కృతిక నేపథ్యం ఉంది. దళిత రచయితలు తమను తాము వ్యక్తీకరించుకునే దశకు తెలుగు దళిత సాహిత్యం ఎదిగింది. ఈ స్థితిలో అగ్రకుల సాహిత్యకారులు వీటి కింద చేరిపోయి వాటికి వంత పాడే స్థితి వచ్చేసింది. ఇది ఒక రకంగా వారికి మింగుడు పడని విషయం.

దళితులు తమను తాము సాహిత్యంలో వ్యక్తీకరించుకునే దశలో దళితవాద కవిత్వానికి వెన్నుదన్నుగా ఉన్న విమర్శకుడు లక్ష్మీనరసయ్య, స్త్రీవాదానికి చెందిన ఓల్గా వంటివారు దళితవాదానికి, స్త్రీవాదానికి, బహుజనులకు మధ్య కృత్రిమ పొత్తు కుదిర్చడానికి మార్క్సిజం రంగుపూసి సాహిత్యంలో ఒక 'పెద్దగుంపు'ను తయారు చేసే ప్రయత్నం చేశారు. మరో వైపు దళితులను ఏకతాటి మీదికి తేవడానికి ఒక ఎన్‌జివో సహకారంతో పెద్ద యెత్తున ఒక సాహితీ సదస్సును నిర్వహించారు. దళిత సాహిత్యంతో బిసి సాహిత్యకారులు గొంతు కలిపారు. 'దళిత కవిత్వంలో ముప్పాతిక ముప్వీసం బిసిలదే' అని 'వెంటాడే కలాలు' పుస్తకానికి ముందు మాట రాసుకున్న ఇద్దరు కవులు ప్రసేన్, జూలూరు గౌరీశంకర్ చెప్పుకున్నారు. దేశీయ మార్క్సిజాన్ని ప్రతిపాదించింది కూడా బిసి కులానికి చెందిన లక్ష్మీనరసయ్యే. ఇదెంత తొందరపాటు చర్యనో ఇప్పటికీ అర్థం కాలేదంటే విప్లవ సాహిత్యోద్యమంలో తల పెట్టినవారు బయటకొచ్చినా సిద్ధాంతం ముందు జీవితం దిగదుడుపేనని చెప్పే ధోరణి మార్చుకోలేరని అనుకోవాల్సి ఉంటుంది.

ఇదే సమయంలో దళిత సాహిత్యకారులు, బిసి సాహిత్యకారులు దళిత సాహిత్య విమర్శ పేరుతో సిద్ధాంత చర్చ చేశారు. వీరికి కె.శ్రీనివాస్ వంటి అగ్రకుల మేధావులు తోడుగా నిలిచారు. ఈయన అప్పుడప్పుడు సందేహాలు వ్యక్తం చేస్తూ వచ్చారు. ఈ నూతన ధోరణులను తమలో ఇముడ్చుకుని బలోపేతం కావడానికి విప్లవ శిబిరం కూడా ప్రయత్నించకపోలేదు. సాహిత్య సృజన, సిద్ధాంత రూపకల్పన వేర్వేరని, సృజనాత్మక సాహిత్యం ద్వారా సిద్ధాంతాన్ని పుట్టించలేమని వీరు గ్రహించలేకపోయారు. పేజీల కొద్దీ చర్చలను రసవత్తరంగా పండించి ఇసుమంత రసాన్ని కూడా వెలికి తీయలేకపోయారు. అయితే కొందరు తమను తాము వ్యక్తీకరించుకోవడానికి విశేష కృషి చేశారు. వీరి కృషిని గుర్తించి, ప్రోత్సహించాల్సింది

పోయి దళిత సాహిత్యం స్తబ్దతకు గురైందనే వాదనను ముందుకు తెచ్చారు. సిద్ధాంతం లేకపోయినంత మాత్రాన సాహిత్య సృజన జరగకుండా ఆగిపోదు కదా! దేశీయ మార్గాన్ని ప్రతిపాదించి దళితులు తమను తాము వ్యక్తీకరించుకునే పనిని చిన్నచూపు చూశారు. లేదంటే తప్పుదారి పట్టించారని అనుకోవాల్సి వస్తుంది.

ఇలా దళిత సాహిత్యానికి నష్టం చేసిన బిసి సాహిత్యకారులు -ఎస్సీ కవులు దళిత కవిత్వాన్ని హైజాక్ చేశారని బాధ నటిస్తున్నారు. ఆ రోజుల్లో దళితులతో కలిసి అడుగేస్తే తప్ప వారికి మనుగడ లేదు. ఈ విషయం ఇప్పుడు స్పష్టంగానే తెలిసిపోతోంది. ఆ రోజు దళిత సాహిత్యకారులతో గొంతు కలపనివారు ఇవాళ తమ ఉనికి కోసం కార్యక్రమాలు నిర్వహించుకుని మేమున్నామంటూ చెప్పుకోవాల్సి వస్తోంది. ఇంతకు ముందు పొడనే సహించని 'మధ్యేమార్గ కవులతో' కరచాలనం చేస్తున్నారు. గ్లోబలైజేషన్ వ్యతిరేకపోరాటమనే మంత్ర జపం చేస్తున్నారు. దళిత కవిత్వంలో తమ ఉనికిని కోల్పోయిన కవులు 'వెంటాడే కలాలు' అనే పుస్తకానికి శ్రీకారం చుట్టారు. దీనికి ముందు మాట రాసినవారు ఎంత దౌర్జన్యకారులంటే సంకలనంలో కవితలున్న కవులందరూ తమ వాదనతో ఏకీభవిస్తున్నారని కాదు అని చెప్పుకుని మొత్తం బిసి కవులందరి గొంతు నొక్కే పనికి ఒడిగట్టారు. ఈ పుస్తకంలో మొత్తం 24 మంది కవుల కవితలున్నాయి. ఎక్కడా చోటు లభించనివారు గ్లోబలైజేషన్ వ్యతిరేక సాహిత్య సృష్టి జరగాలని తమ ఉనికిని కాపాడుకోవడానికి ప్రయత్నిస్తుంటే, దళిత, బహుజన, స్త్రీ, ముస్లిం వాదులను ఏకం చేసి ఉద్యమాన్ని (సాహిత్యోద్యమం కాదు, రాజకీయోద్యమం) నిర్మిద్దామని ప్రయత్నించేవారే బిసి కవితా సంకలనం వెనుక ఉన్నట్లు నిరూపించాల్సిన  అవసరమేదీ లేదు.

ఇక, దళిత కవిత్వం మాల, మాదిగ దళిత కవిత్వాలుగా విడిపోయిందంటూ బాధపడ్డారు. ఇలా విడిపోవడం వల్ల దళిత సాహిత్యానికి వచ్చిన నష్టమేమీ లేదు. అది దళిత కవిత్వానికి మరింత పదును తెచ్చిందనే విషయం వీరికి అర్థమైనట్లు లేదు. అలాగే, దళిత సాహిత్యకారులు ఒరగబెట్టిందేమీ లేదని ఒక మాటలో తేల్చేశారు. నిజానికి, సాహిత్యంలో విప్లవ సాహిత్యం తర్వాత అంత ప్రభావం చూపింది, సమాజంలో కొత్త ఆలోచనా ధోరణిని స్థిరీకరించింది దళిత సాహిత్యమే. సాహిత్యం సాంస్కృతిక మార్పునకు, తద్వారా సామాజిక మార్పునకు దోహదపడాలని అనుకుంటే ఆ పని గొప్పగా చేసింది దళిత సాహిత్యమే. దీన్ని పక్కనపెడితే, మాల, మాదిగ



సాహిత్యాలు వేరుపడ్డాయని బాధపడిన వెంటాడే కలాల సారథులు ప్రసేన్, గౌరీశంకర్‌ల సంకలనం పుట్టుకలోనే వేర్పాటు ధోరణులున్నాయనే విషయం గుర్తించడం లేదు.

మైనారిటీ బిసిలు అనే సూత్రీకరణ బిసి కవుల మధ్య వైరుధ్యాలకు, ఘర్షణలకు పాదులు వేసే సదవకాశమొకటి ఉంది. దీన్ని బిసి కవులకు నాయకత్వం వహిస్తున్నామని చెప్పుకుంటున్నవాళ్లు ఎలా స్వీకరిస్తారు. బిసిలందరికీ అందాల్సిన ఫలాలను కొన్ని బిసి కులాలు మాత్రమే తన్నుకుపోతున్నాయనే స్పృహ వీరిలో రాదని ఏమీ లేదు. ఇది మంచిదా, చెడ్డదా అనే విషయంలో మనకు సరైన దృక్కోణం ఉంటే తప్ప మాలలు, మాదిగలు ఘర్షణ పడడం తప్పో, ఒప్పో చెప్పలేం.

ముందే అనుకున్నట్లు దళిత సాహిత్య మూలాలు తెలియనివారు, తమ ఉనికిని ఏదో రకంగా కాపాడుకోవాలనుకుంటున్నవారు గ్లోబలైజేషన్ వ్యతిరేక సాహిత్య సృజన గురించి, బిసి కవిత్వం (సాహిత్యం కాదు, కవిత్వం మాత్రమే సాహిత్యం అవుతుందని చెప్పేవాళ్ల హడావిడే ఎక్కువ. ఈ కవిత్వమే సామాజిక, రాజకీయ ఉద్యమాలను, వాటికి ప్రాణప్రదమైన సిద్ధాంతాన్ని రూపొందిస్తుందని వీరు చెప్పుతుంటారు) గురించి మాట్లాడుతున్నారు. సారంలో ఈ రెండూ ఒకటే. అందుకే ఒకటే గుంపు రెండు వేర్వేరు శిబిరాలుగా ఇప్పుడు ముందుకు వచ్చింది. ఇలా ముందుకు వచ్చిన వారికి తెలియని విషయమేమిటంటే, సారంలో దళితోద్యమమే గ్లోబలైజేషన్ వ్యతిరేకోద్యమం అవతుందనేది. అలా కావడానికి అవకాశం ఎప్పుడుంటుందంటే, మనం దాన్ని ఆచరించినప్పుడు, అలా ఆచరించే వాతావరణమే లేదు. ఆచరణకు మానవ ప్రవృత్తిని సిద్ధం చేయాల్సిన సాహిత్యం బోధక పాత్ర మాత్రమే తీసుకుంది. విప్లవ సాహిత్యోద్యమ కాలం నుంచీ కూడా ఇదే జరుగుతోంది. దాని లక్షణాలే దళితవాదానికి వచ్చాయి. ఇలా రావడానికి కూడా విప్లవ సాహిత్యోద్యమం నుంచి వచ్చినవారే దీనికి కూడా ప్రవక్తలు కావడం కారణం. ఆచరణ ఉంటే ఇవాళ పరిస్థితి ఇలా వుండేది కాదు. నిబద్ధతను ప్రశ్నించాల్సిన అవసరం కూడా ఇక్కడే వస్తుంది. దాన్ని ఒక పదంగా తప్పు పట్టాల్సిన అవసరం లేదేమో గాని దాన్ని ఉపయోగిస్తున్న తీరును, అది శాసించిన తీరును ప్రశ్నించాల్సి వస్తోంది. ఈ నిబద్ధత అనే పదమే తెలంగాణ రచయితలు తమను తాము వ్యక్తీకరించుకోకుండా కట్టిపడేసింది. దళితవాదులను అలాగే చేయాలనుకుంది. కానీ కుదరలేదు. నిజానికి, దళితులకు చెప్పాలంటే దళిత బహుజనులకు ఒక సిద్ధాంతం రూపొంది ఉంది. దీన్ని

సాహిత్యకారులు గుర్తించ నిరాకరించారు. అలాగే, సురేంద్రరాజు దళిత సాహిత్య **విశ్లేషణ**ను వీరు గుర్తించ నిరాకరించారు. ఇవి రెండు ఉన్న తర్వాత సైద్ధాంతిక, **సాహిత్య** విమర్శకు సంబంధించిన సమస్య తలెత్తాల్సిన అవసరం లేదు. కానీ, ఆ **సమస్య** ఉన్నట్లు ఇప్పటికీ నటించే 'మంద' ఒకటి ఉంది. (తెలుగు సాహిత్యంలో **మొదటి** నుంచీ ఇటువంటి 'మందల'దే రాజ్యం. వీరి కంటికి ఆనింది మాత్రమే **సాహిత్యం**, దానికి సమగ్రతను ఆపాదించడం వీరు చేసే మరో 'సాహసం'. కవిసమయం పేర విజయవాడలో నిర్వహించిన కార్యక్రమాన్ని 'సమకాలీన తెలుగు కవిత్వ సమగ్ర ముఖచిత్రం' అని ప్రకటించుకోవడమనేది ఇటువంటి 'సాహసమే'. ఈ సాహసం చేయడానికి కారణం ప్రశ్నించేవారు లేరనే ధీమా. ఇది మరో చర్చనీయాంశం). ఈ మందకు 'చెలామణి' లక్షణం ఉంది. గ్లోబలైజేషన్ వ్యతిరేక ఆచరణకు, సాహిత్యానికి మార్గం ఏర్పడి ఉంది. దాన్ని ఆచరించి ముందుకు నడిపించేవాళ్లే లేరు. గ్లోబలైజేషన్ వ్యతిరేక సాహిత్య సృజన గురించి మాట్లాడేవారు ఆచరణకు సంబంధం లేని కేవల సృజననే కొలబద్దగా తీసుకుంటున్నారు. అందువల్ల ఇప్పుడు కొత్తగా చేయాల్సిన పనేం లేదు. గుర్తించాల్సిందల్లా మంత్రాలకు చింతకాయలు రాలవేనేది, కవిత్వానికి సామాజిక, రాజకీయ ఉద్యమాలు రావనేది.

**'సాహితి' ఆంధ్రభూమి, 21 మే 2001**



# పాఠకలోకం క్షమించదు గాక క్షమించదు

రెండు దశాబ్దాల క్రితం మాట– వేర్వేరు డిగ్రీ కాలేజీల్లో తెలుగు లెక్చెరర్లుగా పని చేస్తున్న ఇద్దరు ఒకే కార్యానికి పూనుకున్నారు. ఇద్దరి గురి ఒకటే. ఉస్మానియా యూనివర్శిటీలోని తెలుగు శాఖలో చేరిపోవాలనేది వారి కోరిక. అందుకు ముందస్తు ఏర్పాట్లు చేసుకున్నారు. ఇద్దరూ సి. నారాయణరెడ్డి కవిత్వంపై వేర్వేరుగా విశ్లేషణలకు పూనుకున్నారు. ఉన్నది ఒక పోస్టే. ఒకరికే అవకాశం ఉంది. పుస్తకాలు అచ్చేశారు. ఒకరి శ్రమ నిష్ఫలమైంది. ఒకరు సహజంగానే విజయం సాధించారు. ఓడిపోయిన లెక్చెరర్ అత్యంత నిరాశకు లోనయ్యాడు. అది సహజమే. అయితే ఈ జయాపజయాలను విశ్లేషిస్తే సి.నారాయణరెడ్డికి కావాల్సిందేమిటో అర్థమవుతుంది. ఉద్యోగం సాధించుకోలేని వ్యక్తి వర్తమాన యువకవులతో పోటీ పడలేనివాడు. 'ఆధునికత'ను రక్తంలో నింపుకోనివాడు. కవిత్వ పరుగుపందెంలో సి.నారాయణ రెడ్డికి 'వెనుకబడడం' ఇష్టం ఉండదు. కారులో కూర్చుని ధ్యానముద్రలో నిమగ్నమై యువకవులకు ధీటుగా కవిత్వం రాయగలడు. ఇది 'చెలామణి'లో ఉంచుతుందనే విషయం సి. నారాయణరెడ్డికి తెలిసినంతగా మరెవరికీ తెలియదు. ఇదే 'కరెక్ట్' అని వాదించేవాళ్లు యూనివర్శిటీ తెలుగుశాఖలో అప్పుడూ, ఇప్పుడూ ఉన్నారు. నారాయణరెడ్డి ఒక్కొక్క మెట్టే పైకి ఎక్కినా, ఒకేసారి పైకి ఎగిరి ఉన్నతాసనం మీద కూర్చున్నా ఎవరికీ అభ్యంతరం ఉండనవసరం లేదు. అయితే, సమస్యంతా ఎక్కడ వస్తుందంటే, తెలుగు సాహిత్యంపై ఆయన చర్యల ప్రభావం పడడం (కవిత్వ ప్రభావం కాదు) వల్లనే.

గుంటూరు శేషేంద్రశర్మ ఇవాళ కాస్తా బహిరంగంగా ముందుకు వచ్చాడు కాబట్టి అదో చర్చనీయాంశమైంది. బహుశా, శేషేంద్ర శర్మ చాలా కాలంగా బాధపడుతూ ఉంటారు. ఆ బాధను బయటపెట్టుకుని 'కంటు' కావడం మొన్న మొన్నటి దాకా ఆయనకూ సుతారాం ఇష్టం ఉండి ఉండదు. 'కంటు' కాకూడదని, 'కంట పడకూడదని' అనుకునే 'గోడ మీది పిల్లులు' తెలుగు సాహిత్యంలో ఎక్కువ. 'కంటు' కాకూడదని మనం అనుకుంటున్నామంటే, మనం ఇంకా ఏదో ఆశిస్తున్నామని లేదా ఉన్నదేదో కోల్పోతామని వెనుకడుగు వేస్తున్నామని అనుకోవాలి. 'విజయవిహారం'

వ్యాసంలో రాతలో ముందు సి. నారాయణరెడ్డిని వ్యతిరేకించి, ఆ తర్వాత తమ చేతుల మీదుగానే ఆ అక్షరాలను తుడిచేసుకుని 'లొంగినతరం'లోని కొందరి గురించి రాశారు. వీరు పట్టుబడినవాళ్లు. పట్టుబడని వాళ్లు, 'చిక్కడు– దొరకడు'లాంటివారు తెలుగు సాహిత్యంలో ఎక్కువ.

సి. నారాయణరెడ్డి 'కవిత్వాచరణ'ను తృణీకరించేవాళ్లు కూడా లోలోపల మిలాఖతయిన వైనం చూస్తూనే ఉన్నాం. 'గాఢమైన స్నేహాల'వల్ల ఇలా మిలాఖతయినవారిని సహిస్తున్నాం.

ఇది నిజానికి, సి. నారాయణ రెడ్డి వల్ల వచ్చిన సమస్య కాదు. అసలు, నారాయణ రెడ్డిని వ్యతిరేకించడమో, సమర్థించడమో చేయాల్సిన అవసరం కూడా లేదు. అవార్డులు లాంటివి ఆయన దయాదాక్షిణ్యాలు ఉంటే తప్ప రాకపోవచ్చు. ఆ అవార్డుల కోసం దాస్యం చేసే 'మహామహులు'న్నారు. పేర్లెందుకు గాని– 'పైరవీ మార్గం' పడితే గాని అవార్డులు రాని పరిస్థితి ఉన్న మాట నిజమే. (ఇది ఒక సాహిత్యానికే కాదు అన్ని రంగాలకూ వర్తిస్తుంది) ఆ అవార్డులు పొందే వ్యక్తులను బట్టి కూడా వాటికి విలువ వస్తుంది. ఆ 'విలువ' పోనీ– ఆ అవార్డులు కాసుకు కొరగానివి కానీ– అలా అయితీరే పరిస్థితి వచ్చేసింది. అలా అయింతర్వాత 'పైరవీ మార్గాలు' పనికిమాలిన చర్యలవుతాయి.

ఒక అవార్డుల విషయంలోనే కాదు, సమీక్షలు రాయించుకోవడంలోను, వాటిని అచ్చేయించుకోవడంలోను, ఇంటర్వ్యూలు చేయించుకోవడంలోను, 'ఇప్పుడు వీస్తున్న గాలుల'ను నిర్ధారించడంలోనూ ఇదే తంతు. ప్రచారం ద్వారా పుస్తకాలను పైకెత్తడం, కూల్చేయడం కూడా తెలుగు సాహిత్యంలో 'ఉద్యమ కార్యాచరణ' అయింది. ఈ స్థితిలో దళితవాదం, స్త్రీవాదం, ముస్లింవాదం ఈ కార్యాచరణను మరింత ఉధృతం చేశాయి. ఈ వాదాలు తెచ్చిన చైతన్యాన్ని గుర్తిస్తూనే అవి 'మధ్యేమార్గ కవుల'తో మిలాఖతయిన వైనం గురించి కూడా మాట్లాడుకోవాలి. ముస్లింవాదాన్ని మినహాయిస్తే స్త్రీ, దళిత వాదాలను ముందుకు తెచ్చింది విప్లవ సాహిత్య శిబిరం నుంచి బయటకు వచ్చినవారే కావడం గమనార్హం. విప్లవ సాహిత్య శిబిరంలో కోల్పోయినవాటిని బయటకు రాగానే 'ఆబ'గా అందుకునే స్థితికి వచ్చారు. నిన్నటి శత్రువులే (సిద్ధాంతరీత్యా) నేటి మిత్రులు, నిన్న ఈసడించుకున్న కెరీరజమే నేటి ప్రాణప్రద లక్ష్యం అయ్యాయి. కెరీరజానికి, ఈ వాదాలకు మధ్య ఉన్న సన్నటి పొరను కాపాడుతూ



రావాల్సిన వాళ్లు ఆ పొరను పోటీ పడి చింపేశారు. ఈ క్రమంలో సాహిత్య సభలకు (పుస్తకావిష్కరణసభలకు) పోటీ పడి సి. నారాయణ రెడ్డిని ఆహ్వానించడం మొదలు పెట్టారు. అది నిరాటంకంగా కొనసాగుతోంది. ఈ క్రమంలో అంతకు ముందు అవార్డులను, ప్రశంసలను శ్రీగంటితో కూడా చూడడానికి ఇష్టపడనివారు నేడు వాటి కోసం 'పైరవీమార్గం' మొదలు పెట్టారు.

నిన్నటి విప్లవోద్యమ సాహిత్యంలో ఒంట పట్టించుకున్న 'ఆర్గనైజింగ్ కెపాసిటీ'ని ఇప్పుడు సమర్థంగా ఆచరణలో పెడుతున్నారు. విప్లవోద్యమ సాహిత్యంలో సృజనాత్మకరాహిత్యం 'సృజనాత్మకత'గా చెలామణి కావడం ప్రారంభమైంది. ఇది ఇప్పుడు పరాకాష్టకు చేరుకుంది. విప్లవ సాహిత్యోద్యమం 'సానుభూతిపరుల' పంట పండించింది. కె. శివారెడ్డి, ఓల్గా రచనలు చాలా వరకు 'గొంతు దిగని ఘనపదార్థాలు'. శివారెడ్డి కవిత్వం విప్లవ సాహిత్యానికి చేసిన నష్టం అంతా ఇంతా కాదు. ఇమేజరీల గారడీలో దారి తప్పిన కవిత్వం అది. ఉదాహరణకు– 'హోటల్‌లో బరంపురం' కవిత నేపథ్యం తెలిస్తే తప్ప అర్థం కాదు. ఈ నేపథ్యం మా లాంటి 'దూరపు పాఠకులకు' తెలిసే అవకాశం లేదు. అలాగే పౌరహక్కుల సంఘం నేత డాక్టర్ రామనాథంపై రాసిన ఎలిజీ 'సార్వజనీనత'ను సంతరించుకుని ఎవరికీ ఆగ్రహం తెప్పించలేని కవిత అయింది. ఇప్పుడు శివారెడ్డి విప్లవ కవిత్వాన్ని నడిపించినంత కాలం నడిపించి 'మధ్యేమార్గ కవిత్వాన్ని' పండించి ఆచరణలో 'మధ్యేమార్గం'లో కలిసిపోయాడు. ఓల్గా కథలు– సిద్ధాంత రచనలే తప్ప సృజనాత్మక రచనలు కావు. జీవితం నుంచి పుట్టిన కథలు కావవి, సిద్ధాంతం నుంచి పుట్టినవి. పనిముట్టు ప్రయోజనాన్ని నెరవేర్చడం పోయి, అదే ప్రయోజనమై తిష్టవేసింది. తెలుగు సాహిత్య విశ్లేషకులు, విమర్శకులు ఈ విధమైన రచనలను ఆకాశానికెత్తడం వల్ల కలిగిన నష్టం పూడ్చరానిదై సినారె మార్గం మరింత విశాలమైంది. స్పార్టకస్ 'ఖాకీ బతుకులు' పుస్తకం గురించి జరిగిన ప్రచారోద్యమాన్ని ఒకసారి అవలోకన చేసుకుంటే మనకు ఇదెంత దారుణంగా ఉందో అర్థమవుతుంది. స్పార్టకస్ నిజాయితీని, కృషిని శంకించనవసరం లేదు, ఉద్యోగ రీత్యా అతను పడిన బాధలను తక్కువ చేసి చూడనవసరం లేదు. కానీ, ఆయన నవలను సాహిత్యంగా అంచనా వేసినప్పుడు మాత్రం జాగ్రత్తగా ఉండాలి. 'ఖాకీ బతుకులు' డాక్యుమెంటరీ అవుతుందే గానీ, 'సృజనాత్మక సాహిత్యం' మాత్రం కాదు. ఈ ముగ్గురు సాహితీవేత్తలను తీసుకోవడానికి కారణమేమిటంటే, వీరు

అక్కడక్కడా మైలురాళ్ల వంటివారు కావడం కాబట్టి. మొత్తం తెలుగు సాహిత్య పోకడ ఇది. (ప్రత్యామ్నాయంగా ఉద్యమంతో విభేదించని, అభిప్రాయాలు సంఘర్షణ పడని శిబిరం నుంచి వస్తున్న సాహిత్యం ఉంది.దాన్నిక్కడ ప్రస్తావించడం లేదు) మొత్తం తెలుగు సాహిత్య అత్యధిక జనాభా సినారె మార్గంలోకి వెళ్లిపోవడానికి ముందు కూడా ఇదే ధోరణిని 'ప్రత్యామ్నాయంగా' కొనసాగించారు. కాబట్టి పెద్దగా చింతించాల్సిన అవసరం లేదు. ముందే అనుకున్నట్లు 'చెలామణి', 'అవార్డులు' అనే వాటి విలువ తగ్గిపోతోంది; ఒక్క సాహిత్య అవార్డుల విషయంలోనే కాదు; అన్ని అవార్డుల విషయంలోనూ అదే జరుగుతోంది. తాజాగా– సినిమా జాతీయ అవార్డులు ఈ డొల్లతనాన్ని బయటపెట్టడం చూస్తూనే ఉన్నాం. ఇలాగే, జర్నలిజంతో ఏ మాత్రం సంబంధం లేని ఒక 'ప్రత్యామ్నాయ సాంస్కృతిక కార్యకర్త'కు, ఎన్‌జివో (NGO) క్రియాశీలక కార్యకర్తకు 'బెస్ట్ ఉమెన్ జర్నలిస్టు' అవార్డు వచ్చింది. దీనికి చింతించడానికి బదులు సంతోషించాలి. అవార్డులు, శాలువాలు నయా పైసా నాణేలు కావాలి. అదే జరుగుతోంది.

ప్రస్తుత విషయానికి వస్తే, అవార్డులు, గౌరవాలు దక్కడం విషయం అటుంచి, సాహిత్య మర్యాదలకు, గుర్తింపులకు నోచుకోని 'అల్పసంఖ్యాక' వర్గమొకటి ఉంది. నగ్నముని, అజంతా, ఇస్మాయిల్, డాక్టర్ కేశవరెడ్డి, కెయన్‌వై పతంజలి– వీరు అన్నింటికీ అతీతులు. సాహిత్య విమర్శకులు, సాహిత్యోద్యమ కార్యకర్తలు వీరికి చేసిన నష్టాన్ని 'సామాన్య పాఠకలోకం' క్షమించదు గాక క్షమించదు.

ఈ స్థితిలో గుంటూరు శేషేంద్రశర్మ 'మండే గుండెలు' సెగలు కక్కడం, సెనారెను తిట్టిపోసుకోవడం అనవసరమేమో!

**విజయవిహారం, ఏప్రిల్ 2001**



# ముస్లిం కవులకు లక్ష్మణరేఖలు గీస్తున్న నిరింద్రియ మేధావులు

"బ్రాహ్మణవాదం కేవలం బ్రాహ్మణులకు మాత్రమే పరిమితమైనది కాదు. ప్రారంభించి ప్రచారం చేసింది వాళ్లే అయినప్పటికి అది వారికే పరిమితమై లేదు. రాను రాను ఇతర హిందూ కులాలు, విదేశీ దండ యాత్రికులు, భారతీయ రాజ్యాలు దాన్ని సమర్థించి తమ స్వంత ప్రయోజనాలకు వాడుకున్నారు. తద్వారా బ్రాహ్మణవాదం ఇప్పుడు ఉన్నంత శక్తివంతమైన వాదంగా ఎదగడానికి దోహదపడ్డారు. కులవ్యవస్థని, పౌరోహిత్య క్రతువులనూ అందరు దోపిడీదారులు ఉపయోగించుకున్నారు".

"భారతీయలు తమ రాజకీయ స్వాతంత్ర్యాన్ని కోల్పోయిన తర్వాత బ్రాహ్మణవాదాన్నే తమ మతంగా, సంస్కృతిగా ఆమోదించక తప్పని స్థితికి వచ్చారు. దాని అన్యాయాలకూ, దాని అసత్యాలకూ తమను అర్పించుకొన్నారు".

"రామాయణం ఎంతగా హృదయాలను స్పృశించేదిగా ఉన్నప్పటికీ దాన్ని తమ మతగ్రంథంగా అంగీకరించడానికి ఏ హిందువైనా సిగ్గు పడతాడు".

"బ్రిటిష్ సామ్రాజ్యవాదం సైతం మార్పుకు గురవుతుంది కానీ బ్రాహ్మణ సామ్రాజ్యవాదం మాత్రం అంతే క్రూరంగా ఉంది".

"బ్రాహ్మణవాదం పుట్టిన దగ్గర నుండి ఇప్పటి వరకూ హిందూ ప్రజానీకాన్ని నైతికంగా, మేధోపరంగా నిర్వీర్యులని చేసి హిందూ జాతిని నీచత్వంలోనూ, అనైక్యతలోనూ జీవించి మరణించేట్టు చేసి నిజమైన మతాన్ని క్రతువుల వరదలో ముంచెత్తి హిందూ భక్తులను దారుణమైన దోపిడీకి గురి చేసింది".

–స్వామి ధర్మతీర్థ (హిందూ సామ్రాజ్యవాద చరిత్ర, 1941)

స్వామి ధర్మతీర్థ చెప్పిన హిందూ మతానికి లేదా ధర్మానికి ఇప్పుడు హిందూ మతంగా చెలామణి అవుతున్నదానికి ఏ మాత్రం సంబంధం లేదు. బ్రాహ్మణవాదం హిందూ ప్రజలను అంటే భారతీయులను ఎలా అనైక్యతలోకి నెట్టిందో, తమ భోగలాలసత్వం కోసం, వ్యక్తిగత లాభార్జన కోసం సమాజాన్ని ఎలా కులాలుగా విభజించిందో, పాలకుల చేతా, ప్రజల చేతా నయాన్నో, భయాన్నో ఏ విధంగా తమ వాదాన్ని అంగీకరింపజేసి పబ్బం గడుపుకుంటూ వచ్చిందో స్వామి ధర్మతీర్థ వివరంగా విశదీకరించారు. బ్రాహ్మణులకు వ్యతిరేకంగా పోరాడేందుకు సిద్ధపడిన శ్రీరాముడ్ని బ్రాహ్మణులు ఎలా లోబర్చుకున్నారనే విషయాన్ని కూడా ఆయన చెప్పారు. ఇప్పుడు మనం హిందూ మతం అనుకునేది కొద్దిమంది బ్రాహ్మణుల మతంగా మొదలై మెజారిటీ

ప్రజల మతంగా రూపుదిద్దుకుంది. ప్రజలు నేడు ఆరాధిస్తున్న రాముడు కూడా కొద్ది మంది బ్రాహ్మణుల దేవుడే తప్ప అశేష భారత (హిందూ) ప్రజల దేవుడు కాడు. కొన్ని వేల ఏళ్ల పరిణామక్రమంలో కొద్ది మంది బ్రాహ్మణుల మతం అశేష ప్రజానీకం మతంగా ఎదిగింది. ఈ బ్రాహ్మణ వాదాన్నే హిందూ మతంగా అంగీకరించే స్థితిలోకి భారతీయులందరూ నెట్టబడ్డారు. ఇవాళ్ల హిందూ మతమంటే బ్రాహ్మణవాదమే తప్ప మరోటి కాదు. ఇవాళ్ల బ్రాహ్మణవాదం (కులం కాదు, విశ్వాసం) అన్ని కులాల వారి చేత తాము హిందువులమని ఏ ప్రమేయం లేకుండానే అంగీకరింపజేసే స్థితికి ఎదిగింది. తమ ప్రయోజనాలకు విఘాతం కలిగించే శక్తులు ఎదురయినప్పుడు అన్ని కులాలవారిని హిందువుల పేరుతో ఎదుర్కొనేందుకు సిద్ధం చేస్తూ, మిగతా సందర్భాల్లో దాదాపుగా అన్ని కులాలను దూరంగా ఉంచే నీచ ఎత్తుగడను అవలంభిస్తోంది. ఈ స్థితిలో ముస్లింలను ఎదుర్కొనేందుకు అది అన్ని కులాల భారతీయులను 'హిందూజాతి' పేర సంసిద్ధం చేసే ఎత్తుగడను అనుసరిస్తూ వస్తోంది. రాజకీయం భారతదేశంలో ఎప్పుడూ బలహీనంగా ఉంటూ వస్తోంది. ఈ హిందూ బ్రాహ్మణవాదులను ఎదుర్కొని ప్రజలందరినీ ఐక్యం చేసే శక్తి దానికెప్పుడూ లేదు. అందువల్లనే ఇప్పటికి బ్రాహ్మణపాదం తన పట్టు బిగిస్తూ వస్తోంది.

నల్లగొండ నుంచి స్కైబాబ సంపాదకత్వంలో వెలువడిన 'జల్‌జలా' కవిత్వంపై దాడిని ఈ నేపథ్యంలోంచే చూడాల్సి వుంటుంది. స్కైబాబ 'ప్రజాతంత్ర'లో రాసిన కథను విమర్శించే సాకుతో ఈశ్వరానంద జల్‌జలాలోని కొన్ని కవితలపై కత్తులు దూసి 'బ్రహ్మానంద'పడిపోయాడు. నిజానికి, ఈశ్వరానంద ఉద్దేశం స్కైబాబ కథను తప్పు పట్టడం కాదు; 'జల్‌జలా' కవిత్వాన్ని దుయ్యబట్టడం. ముస్లింవాదులు తమ అస్తిత్వాన్ని లేదా ఐడెంటిటీని వెతుక్కోవడం అతనికి రుచించలేదు. బ్రాహ్మణవాద భావజాలానికి నిబద్ధులైన నిరింద్రియ మేధావులు ముస్లిం వాద కవిత్వం పరిధులు దాటవద్దని 'లక్ష్మణ రేఖలు' గీస్తుంటే, ఈశ్వరానంద వంటి పచ్చి కరుడు గట్టిన బ్రాహ్మణవాదులు 'ఫత్వాలు' జారీ చేస్తున్నారు. తన దాకా వస్తే గానీ తెలియదంటారు. కానీ, తన దాకా వచ్చినప్పుడు ఒక రకంగానూ, ఇతరుల దాకా వచ్చినప్పుడు మరో రకంగానూ ప్రవర్తించే లక్షణం తమకు ప్రత్యేక హక్కులను, అధికారాలను, స్వేచ్ఛను నిర్దేశించుకుని, అందరి చేత ఆమోద ముద్ర వేయించుకున్న బ్రాహ్మణవాదులకు రక్తంలోనే ఇమిడిపోయి ఉంది. భావ ప్రకటనా స్వేచ్ఛ కూడా వారి కాళ్ల దగ్గర దాస్యం చేయాల్సిందే.



బ్రాహ్మణవాదానికి పుట్టుకతోనే అత్యధిక సంఖ్యాక దళిత, బహుజనులు కట్టుబడిపోయారు. అయితే, దానికి కట్టుబడిపోనిది ముస్లింలే. కింది స్థాయిలో దళిత బహుజనులు, ముస్లింలు సహజీవనం చేస్తూనే ఉన్నారు. ఒకరి మతం మరొకరికి ఎప్పుడూ సహజీవనానికి అడ్డంకి కాలేదు. ఇస్లాంను దళిత, బహుజనులు ఒక కులంగా చూశారే తప్ప మతంగా చూడలేదు. చిక్కంతా పట్టణ జీవుల నుంచి, నిరింద్రియ మేధావుల నుంచి వచ్చి పడుతోంది. ప్రజానీకం మనోభావాలను, అభిప్రాయాలను నియంత్రించే సత్తా గల బ్రాహ్మణ మేధావులు ప్రాచీన కుట్రనే ఇప్పుడూ ప్రయోగిస్తున్నారు. దీనికి తోడు, విడివిడిగా వుంటూనే హిందూ ప్రజలు గొర్రెదాటు వ్యవహారంగా తమను బలపరచాలని బ్రాహ్మణవాదులు కోరుకుంటున్నారు. ఈ స్థితిలో తమకు పూర్తిగా లోబడిపోయి జీవిస్తున్న చిత్రకారుడు ఎం.ఎఫ్. హుస్సేన్ లాంటి వారి పట్ల వారు ఉదార దృక్పథం అవలంభిస్తారు. ముస్లింలు తమ మతంలోని ఛాందసవాదాన్ని ప్రశ్నించాలి గాని హిందూ సమాజంలోని దాష్టికాన్ని ప్రశ్నించకూడదనేది బ్రాహ్మణవాదుల అభిప్రాయం. ముస్లింల జీవితాలను ఇవాళ్ల ఇస్లాం కన్నా బ్రాహ్మణవాదమే ఎక్కువగా నియంత్రిస్తోంది. ఈ కారణంగా వారు ప్రధానంగా బ్రాహ్మణవాదాన్ని ప్రశ్నించాల్సిన అనివార్యతలో చిక్కుకున్నారు. ఈ దృష్ట్యా ముస్లిం కవులు తప్పకుండా హిందూ మతాన్ని తృణీకరించడమో, వ్యతిరేకించడమో చేయకతప్పదు. ఆ పనే జల్‌జలా కవులు చేశారు. ఇదిలా వుంటే, ముస్లింలు దారుణమైన వివక్షకు గురవుతున్నారు; ముస్లింలు కూడా ఈ దేశానికి సంబంధించిన వాళ్లనే విషయాన్ని తమకు తెలియకుండానే కింది కులస్థుల నుంచి పైకులస్థుల వరకు అంగీకరించని పరిస్థితిని కల్పించి పెట్టారు. అందుకే, తమకు ఈ దేశంలో జరుగుతున్న అన్యాయాల పట్ల, తమకు ఎదురవుతున్న కష్టాల పట్ల ఆగ్రహం ప్రకటిస్తే అది విచ్ఛిన్నకర ధోరణి అవుతుంది. మతోన్మాదాన్ని రెచ్చగొట్టడమవుతుంది. రాజ్యం అదుపు చేయడానికి ఉపయోగించే చట్టాల కన్నా భారతదేశంలో బ్రాహ్మణ మేధోజనితమైన విలువల చట్రాలకే బలం ఎక్కువ. ఈ విలువల చట్రం నుంచే 'జల్‌జలా' కవులను ప్రశ్నిస్తున్నారు. ఈ విలువలను బద్దలు కొట్టడమే ఇప్పుడు చేయాల్సిన పని. ఈ పని కొంతలో కొంతయినా జల్‌జలా కవులు చేశారు. అందుకే, జల్‌జలా కవులపై అంత అసహనం, అంత విసుగు, అంత ఆగ్రహం. జల్‌జలా కవులు తమ మతంలోని ఛాందసవాదాన్ని గట్టిగానే ప్రశ్నించారు. మతం పేర అమలవుతున్న అణచివేతనూ ప్రశ్నించారు. ముస్లింలు ఈ అణచివేతను, ఛాందసవాదాన్ని ప్రశిస్తూ పోతే బ్రాహ్మణవాదులకు పరోక్ష లాభం చేకూరుతుంది.

వీరి వాదనలను ఉటంకిస్తూ తాము విస్తరణ కాంక్షను ఆచరణ రూపంలో పెట్టడానికి గొప్పగా ముందుకు దూకుతారు. అందుకే, భారతీయ జనతా పార్టీ (బిజెపి)లోని ముస్లింలను మిగతా ముస్లింల ముందు ఆదర్శవంతులుగా చూపుతారు. ప్రాచీన కాలంలో రాజులను శాసించినట్లు ఇవ్వాళ్ల బిజెపిని ఆర్ఎస్ఎస్, ఇతర సంఘ్‌పరివార్ సంస్థలు ప్రశ్నిస్తున్నాయి. (బ్రాహ్మణవాదాన్ని అంగీకరించిన దశరథుడ్ని ఎప్పటికప్పుడు ప్రశ్నించే మునుల మాదిరిగా) ఇస్లాం మత ఛాందసవాదాన్ని జల్‌జలా కవులు ప్రశ్నించకుండా ఉండి ఉన్నట్లయితే వారి పరిస్థితి ఇంకెంత దారుణంగా ఉండేదో! ఒళ్లు దగ్గర పెట్టుకుని ఎక్కువగా తమ మత ఛాందసవాదాన్ని, అణచివేతను ప్రశ్నించారనుకోవాలా?

ఇదిలా వుంటే, కొన్ని సందర్భాల్లో కవిత్వం ఆగ్రహ ప్రకటన మాత్రమే అవుతుంది. కవిత్వంలో కొన్ని సార్లు కార్యకారణ సంబంధాలు వ్యక్తం కావాలనడం కూడా అర్థరహితమే. కవిత్వాన్ని ముక్కలు ముక్కలుగా విడగొట్టి చూసినప్పుడు ఒక రకంగానూ, మొత్తాన్ని కలిపి చూసినప్పుడు మరో రకంగానూ అర్థమవుతుంది. బ్రాహ్మణవాదులు భారత సమాజాన్ని కులాలుగా విభజించినట్లు, కవిత్వాన్ని కూడా ముక్కలు ముక్కలుగా విడగొట్టి చూడదల్చుకున్నప్పుడు విద్వేషపూరితంగానే కనిపిస్తుంది. నిజానికి, ఇలా చూడడంలోనే పెద్ద కుట్ర దాగి ఉంది. ముక్కలు ముక్కలుగా కవిత్వాన్ని విడగొట్టి పాఠకుల ముందు పెట్టి సమాజాన్ని మరింత ముక్కలుగా విడగొట్టి తమ ప్రయోజనాలను నెరవేర్చుకోవాలనే తత్వం వారికి సహజంగానే ఉంది. ఈ సహజ గుణాన్నే వారు ప్రదర్శిస్తారు.

కవిత్వం విషయానికి వస్తే, ముందే అనుకున్నట్లు వర్తమాన కవిత్వం చాలా సార్లు, మరీ ముఖ్యంగా, అణచివేతకు, వివక్షకు గురవుతున్నప్పుడు ఆగ్రహంగానే వెలువడుతుంది. ఆ ఆగ్రహం నుంచి 'అకవిత్వంగా' కవిత్వం వెలువడుతుంది. ఇది గుణమే కాని దోషం కాదు. సందర్భాన్ని బట్టి కూడా భావ వ్యక్తీకరణ ఉంటుంది. ఈ సందర్భం నుంచి విడదీసి కవిత్వాన్ని చూడడం సరి కాదు. సందర్భాన్ని కవిత్వం నుంచి విడదీసి సాధారణీకరించాలనుకుంటే పెద్ద ముప్పే వాటిల్లుతుంది. ఈ సాధారణీకరించడమనేది కూడా బ్రాహ్మణవాదపు కుచ్చిత బుద్ధే. ఈ విధమైన బ్రాహ్మణవాదానికి రాముడ్ని చెట్టు చాటు ధోకేబాజ్ అనడం ద్రోహంగా కనిపిస్తుంది. 'త్రేతాయుగం నుంచి బాబ్రీ శకలాల దాకా/ శవాల మీంచి నడిచి వచ్చిన రాముడు/ నాస్తికుడికైనా నాకైనా రాకాసే' అంటే ఎందుకు తప్పు వచ్చిందో అర్థం కాదు.



జల్‌జలా కవులే కాదు, హిందూ రచయితలు పలువురు ఇంత కన్నా దారుణంగా రాముడి గురించి రాశారు. అవేవీ వీరి కంటికి ఆనవు. ఎందుకు? వారు హిందువులే కాబట్టి. చెడిపోయిన పిల్లవాణ్ని తల్లిదండ్రులు క్షమించి వదిలేసినట్లు వదిలేస్తారు. కొన్ని సందర్భాల్లో బెదిరిస్తారు. దాడులు చేస్తారు; అధికారం ప్రయోగిస్తారు. అంతకు మించి వారికి ఫత్వాలు జారీ చేయరు. కానీ ముస్లింలు ప్రశ్నించేసరికి ఎవరో బయటివారు తమ 'కుటుంబం'లో తలదూర్చినట్లు తెగ రెచ్చిపోతారు. ఫత్వాలు జారీ చేస్తారు. మత విద్వేషకులని ముద్ర వేస్తారు. నిజానికి, జల్‌జలా కవులు ఏ మతాన్నీ ఉన్నదున్నట్లుగా స్వీకరించడానికి సిద్ధంగా లేరు. వారు ఓ తాత్వికతను తమ కవిత్వం ద్వారా అందించారు. ఈ సామాజిక తాత్వికత నిజానికి బ్రాహ్మణవాదులకు మింగుడు పడదు.

ఈ మట్టిలో పుట్టి ఈ మట్టిలో బతుకుతున్న ముస్లింలను ఈ సమాజానికి చెందినవారిగా బ్రాహ్మణవాదులు, లేదంటే హిందువులు గుర్తించ నిరాకరిస్తున్నారు. ముస్లింలకు కూడా ఇక్కడ జీవించే హక్కు ఉందని వారు మనఃపూర్వకంగా విశ్వసించడం లేదు. పరాయి దేశస్థులుగానే చూసే మనస్తత్వం తెలియకుండానే మెజారిటీ ప్రజలకు అలవడిపోయింది. ఈ కారణంగా తాను ఈ దేశానికి చెందినవాడినే అని ప్రకటించుకోవడానికి, తన హక్కులను పొందడానికి, హిందువులతో సమానంగా అవకాశాలను రాబట్టుకోవడానికి తనకు అడ్డుగా ఉన్నవాటి పై ముస్లింలు ఆగ్రహం వ్యక్తం చేయాల్సిందే. జల్‌జలా కవులు చేసిందదే. దేవుడినైనా ధిక్కరించే ధైర్యం కవికి ఉంటుంది; ఉండాలి కూడా. తమకు అడ్డుగోడగా నిలిచిన బ్రాహ్మణాధిపత్యాన్ని దళిత, బహుజనులు ప్రశ్నిస్తున్నారు. జల్‌జలా కవులు కూడా దళిత, బహుజనులు వేసిన ప్రశ్నలే మరో రూపంలో వేస్తున్నారు. దళిత, బహుజనులతో మమేకతను ప్రదర్శిస్తున్నారు. జల్‌జలా కవులు బ్రాహ్మణిజం ఆధిపత్య ధోరణిని ప్రశ్నిస్తూనే, తమ మతంలోని దాష్టీకంపై దాడి చేశారు.

చివరగా మళ్లీ ధర్మతీర్థ మాటలే- "హిందువులు, ముస్లింల మధ్య గానీ, హిందువులకు, మరో ఆత్మగౌరవం ఉన్న జాతికి మధ్య గానీ సరైన అవగాహన కుదరాలంటే హిందువులు బ్రాహ్మణవాద సామాజిక నిర్మాణాన్ని వదలుకొని ప్రజాస్వామిక సూత్రాలతో సమాజాన్ని నిర్మించుకుంటేనే తప్ప అది కుదరని పని".

హర్యాలి, 2002

# వాళ్లూ - మనమూ - అతనూ

కాళోజీని యాది చేసుకుంటే తెలంగాణను యాది చేసుకున్నట్టే. తెలంగాణను యాది చేసుకున్నా కాళోజీని యాది చేసుకున్నట్టే. ఆయనకూ తెలంగాణకు విడదీయరాని అనుబంధం ఉంది. ఆయన ఎప్పుడూ బలహీనుల పక్షాన్నే ఉన్నారు. ఆయన కళ్ల ముందు దెబ్బయ్యేళ్ల తెలంగాణ కదిలిపోయింది. ఇందులో ప్రజల కన్నీళ్లు, అనేకానేక ఉద్యమాలు ఉన్నాయి. దగాపడ్డ తెలంగాణను తలుచుకుంటే ఆయన నిలువెల్లా కన్నీరవుతారు. ఇందులో భాగంగానే ఆయన కవిత్వం రాసినారు. ఆయన జీవితం నుంచి కవిత్వాన్ని వేరు చేసి చూడడం సాధ్యం కాదు. అట్లాగే, ఉద్యమాల నుంచి కూడా ఆయనను వేరు చేసి చూడలేం. అట్లని ఆయన ఏ ఒక్క సిద్ధాంతానికో కట్టుబడి పని చేయలేదు. అట్లాగ కట్టుబడి పని చేయడాన్ని ఆయన ఇష్టపడలేదు. "ఎన్నో రకాలుగా తమ తమ ఆలోచనల పరిధిలోనే మార్గాన్ని నిర్ణయించి, ఆ మార్గాన్నే మనిషిని నడిపింపజేయాలనే మేధావి వర్గంలోని వ్యక్తుల కృషి. దానికి ఎన్నో ఇజాలు, చాదస్తాలు. ఇదంతా ఎందుకంటే మనిషి సహజంగా ఆలోచించి స్వంత నిర్ణయానికి రాకుండా చేయడానికి" అని ఆయనే చెప్పుకున్నారు. అంతేకాదు, "ఏదో సూత్రానికి, ఇజానికి కట్టుబడిపోయి జీవిస్తున్న ప్రాణాలకు స్వేచ్ఛా జీవనం సున్న" అని కూడా స్పష్టం చెప్పినారు. అందువల్లనే ఆయన ప్రజల పక్షాన జరిగిన ప్రతి ఉద్యమంలోనూ ఉండగలిగినారు. ప్రతి అన్యాయం పట్ల ఆగ్రహం వెలిబుచ్చినారు. పౌరహక్కులకు భంగం వాటిల్లినప్పుడు, రాజ్యహింస పెచ్చరిల్లినప్పుడు, ప్రభుత్వాలు నిరంకుశంగా వ్యవహరించినప్పుడు ఏ జంకూ గొంకూ లేకుండా, మొహమాటాలు లేకుండా ధైర్యంగా తన గొంతు విప్పినారు. ఇందులో భాగంగానే ఆయన కవిత్వం వెలువడింది. నిజానికి కాళోజీ 'కవి' కారు. కానీ, అంతకు మించినవారు. కబీరు, వేమనల వంటి ఒక సంతు. దోహాలు వినిపిస్తూ సమాజాన్ని జాగృతం చేసే ఆ సర్వసంగ పరిత్యాగుల లక్షణాలు కాళోజీకి, ఆయన కవిత్వానికి ఉన్నాయి. ఆధునిక కవుల్లో కవిత్వాన్ని ఒక ఆయుధంగా వాడుకున్న వచనకవులు కాళోజీ తప్ప మరొకరు లేరు. తనది కవిత్వం అవునా, కాదా అన్న మీమాంస ఆయనకు లేదు. తన కవిత్వాన్ని కవిత్వంగా గుర్తించకపోయినా ఆయనకు బాధేం లేదు.



తెలంగాణ సామాజిక, రాజకీయ చరిత్రను, ముఖ్యంగా మనిషి జీవన చరిత్రను పట్టిచ్చే కాళోజీ కవిత్వాన్నంతటినీ ఒక దగ్గర చేర్చి హైద్రాబాద్, వరంగల్లులకు చెందిన కాళోజీ ఫౌండేషన్ వారు 'నా గొడవ' పుస్తకంగా వెలువరించినారు. దాదాపు 450 పేజీల పుస్తకం ఇది. దాదాపుగా కాళోజీ కవిత్వమంతా ఇందులో ఉంది. ఈ సంకలనంలో 1953లో మొదటిసారిగా అచ్చయిన 'నా గొడవ' సంపుటిలోని కవితల నుంచి 1966-67లలో జనరల్ ఎలక్షన్లను దృష్టిలో వుంచుకొని రాసిన 'పరాభవ వసంతం', 'పరాభవ శిశిరం' మొదలైనవాటితో పాటు 1962లో భారత, చైనా యుద్ధ సమయంలో రాసిన గేయాలు, 1975, 1977 మధ్య కాలంలో రాసిన కవితలు, 1969 తెలంగాణ ఉద్యమ కాలంలో రాసిన కవితలు ఉన్నాయి. కాళోజీ కవిత్వ సమగ్ర సంకలనం ఇది. ఈ పుస్తకానికి డాక్టర్ దాశరథి రంగాచార్య, వరవరరావు, బి. తిరుపతిరావు, తూర్పు మల్లారెడ్డి ముందు మాటలు ఉన్నాయి.

ఇందులో దాశరథి రంగాచార్య కాళోజీ సమకాలికులు, సన్నిహిత మిత్రులు. వరవరరావు కాళోజీని అత్యంత సన్నిహితంగా ఎరిగినవారు. తూర్పు మల్లారెడ్డి కాళోజీ సాహిత్యంపై అమూల్యమైన పరిశోధనను వెలువరించినవారు. ఇందులో తిరుపతిరావు మాత్రమే ప్రాంతీయంగా, సాహిత్యపరంగా కాళోజీకి దూరం.

నా గొడవ కవితా సంకలనానికి కాళోజీ తన దృక్పథాన్ని జంకూ గొంకూ లేకుండా చెప్పుకున్నారు. ఆయన తను నమ్మిన విశ్వాసాల కోసం జీవితాంతం నిలబడ్డారు; నిలబడుతున్నారు. ఏదో ఒక విశ్వాసానికి తాను కట్టుబడి లేనని ఆయనే చెప్పుకున్నారు. అయితే, కాళోజీ తెలంగాణకు కావాల్సిందేమిటో బాగా ఎరిగినవారు కాబట్టే ఆ విధంగా ఉన్నారనిపిస్తుంది. తూర్పు మల్లారెడ్డి అన్నట్టు "కాళోజీ ప్రజాస్వామ్యవాది. రాజ్యాంగబద్ధంగా ప్రజాస్వామ్య సూత్రాలకు అనుగుణంగా పాలన జరగాలనేది ఆయన నిశ్చితాభిప్రాయం". ఈ అభిప్రాయం వల్లనే ఆయన ఎక్కడా ఆగిపోకుండా, నిరంతర జీవనదిలా నిరసన గళం వినిపిస్తూ రాగలిగారు. అందుకే శ్రీశ్రీ- "యుద్ధంలో ఫ్రాన్స్ కవులంతా చెల్లాచెదురుగా పారిపోతే లూయీ ఆరగాన్ ఒక్కడే దేశంలో నిలబడి మహా ప్రజావిశ్వాసాన్ని వెల్లడించే గీతాలు రాశాడు. కాళోజీ లూయీ ఆరగాన్ వంటివాడు. తెలంగాణ మూగ జీవాల హృదయాల్ని ప్రతిబింపజేశాడు" అని ప్రశంసించినాడు.

కోస్తాంధ్రపై ఉన్న పాశ్చాత్య ప్రభావం తెలంగాణపై లేదు. అందుకే అక్కడ దేవులపల్లి కృష్ణశాస్త్రి వంటివారు భావ కవిత్వాన్ని పండిస్తున్న కాలంలోనే ఇక్కడ కాళోజీ వంటి వారు సామాజిక ప్రయోజనాన్ని ఆశించి కవిత్వం రాసినారు. కోస్తాంధ్ర వచన కవిత్వం లక్షణాలు తెలంగాణ కవుల కవిత్వంలో ఉండవు. కోస్తాంధ్ర కవులు, రచయితలు పాశ్చాత్య ప్రభావంలో, బెంగాలీ ప్రభావంలో పడిపోతే, ప్రజలకు అత్యంత సన్నిహితంగా, ఇంకా చెప్పాలంటే ప్రజల జీవితాల్లో భాగమైన ఉర్దూ, పార్శీ కవుల ప్రభావం తెలంగాణ కవులపై పడింది. వచన కవిత్వాన్ని మెరుపులతో, వ్యంగ్యంతో తెలంగాణ కవులు పండించడానికి కారణం ఇదే. ఇదే సంప్రదాయం కాళోజీది. పైగా కాళోజీది నానా భావాల సంగమం కాదు. ఆయన ఒకే లక్ష్యం కోసం నిలబడ్డారు. నిలబడుతున్నారు. ఆయనలో వైరుధ్యాలు లేవు. అట్లాగే ఆయన కవిత్వంలోనూ వైరుధ్యాలు లేవు.

"కాళోజీ కవిత కాలం ప్రసవిస్తున్న వ్యథ. ఆయన నా గొడవ ప్రజల గొడవ. అది సమకాలీన సామాజిక, రాజకీయ, ఆర్థిక, సాహిత్య చరిత్ర పరిణామానికి గచ్ఛద్వ్యాఖ్యానం (రన్నింగ్ కామెంట్రీ)" అని తూర్పు మల్లారెడ్డి అన్న మాటలను అర్థం చేసుకుంటే కాళోజీ కవిత్వం విలువ ఏమిటో తెలుస్తుంది.

మొత్తం మీద, ఒక సర్వసంగ పరిత్యాగి, తెలంగాణ సమాజం కోసమే నిరంతరం తపిస్తున్న ఒక సామాజిక కార్యకర్త, ఖలీల్ జీబ్రాన్, కబీరుదాసు వంటి కవి అయిన కాళోజీ కవిత్వమంతా ఒక పుస్తకంగా వచ్చింది. అది తెలంగాణకు ఒక వరంలాంటిది.

"కాళోజీ జీవనది" పేర పుస్తకానికి వరవరరావు మంచి ముందుమాట రాసినారు. కాళోజీ సామాజిక దృక్పథాన్ని, ఆయన కవితా నిర్మాణ పద్ధతిని, ఆయన కవిత్వంపై కనిపించే ప్రభావాలను ఆయన వివరించినారు. కాళోజీ "నిరంతరం లేవదీసే చర్చ- పోరుడు" అని వరవరరావు చెప్పినారు. "జీవించడం ఆయన జీవన దృక్పథం. నది వలె, ప్రవాహం వలె" అని కూడా చెప్పినారు. వరవరరావు మార్క్సిస్టుల పరిభాషలో కాళోజీని ఆదర్శవాది లేదా మానవతావాది అన్నారు. ఈ వాదాలను మార్క్సిజం భావవాదంలో చేరుస్తుందని కూడా చెప్పినారు. బహుశా వ్యక్తివాదంలో చేరుస్తుందని కూడా చెప్పినారు. అయితే, మార్క్సిస్టులు, విప్లవకారులు, పౌరహక్కుల నేతలు చేయలేని పనులు ఎన్నో ఒంటి చేతితో చేసినారు. ఏ వాదం అయితేనేం పని



జరగడం- ఆ పని బలహీనుల పక్షాన నిలబడి చేయడం ముఖ్యం కాదా? కాళోజీ ఏడు దశాబ్దాల రచనా వ్యాసంగం, కార్యాచరణ తెలంగాణ మేధావులకు ఒక మార్గాన్ని చూపడం లేదా? తెలంగాణ పౌర హక్కుల ఉద్యమాలకు, సాంస్కృతికోద్యమాలకు కాళోజీ బాట తప్ప మరో మార్గం లేదని అనుభవంలోకి రాలేదా? మనం ఇదంతా ఆలోచించే స్థితిలో ఉన్నామా? ఒక్క కాళోజీయే నిరంతరం "మీ రాజ్యాంగాన్ని మీరు అమలు చేయండి, మీరంటున్న ప్రజాస్వామ్య విధానాలకు మీరు కట్టుబడి ఉండండి" అని అడుగుతుంటేనే ఇంత ప్రభావం ఉన్నదే! అందరూ ఒకటై కేవలం కాళోజీ నినదిస్తున్న ఆదర్శం కోసం పని చేస్తే ఇంకెలా ఉంటుంది? కాళోజీ కవిత్వం, ఆచరణ గురించి మాట్లాడాల్సి వచ్చినప్పుడు ఆయన మార్గం గురించి మనం మాట్లాడకుండా ఉండలేం. అందుకే ఈ మాటలు.

**తెలంగాణ రాస్తా, 13 ఏప్రిల్ 2002**